# విజ్ఞప్తి

పఠితృ మహాశయులకు—

తెలుఁగు పత్రికలకుఁ దలమానికమైన భారతి దోఁగాడ నేర్చిన నాఁటఁగోలెఁ బ్రౌఢయై, వలపులూరఁ బలుకనేర్చిన నేఁటి వరకు మేన నూనిన పద్యవ్యాసములే నేటికి గ్రంథరూపమును దాల్చినవి. ఇందలి పద్యములలో విశేష భాగ మింతకుముందే రసపిపాసువుల పరిచయమునకుఁ బాత్రములగుట నా భాగ్యము గాక వేఱుగాదు. పత్రికా ముఖమున నన్నెఱిఁగిన సహృదయులు లేఖాముఖమున నాకుఁ జూపు నాదరాభిమానముల నరసి, 'భాషాభిమానము తెలుఁగునాఁటఁ జావలేదు. నా జన్మము ధన్యమైన'దని సమ్మదాశ్రువులు రాల్చుచు, ధనాభావమున నిరంతరముఁ గుమిలి పోవు నా యాత్మ కూఱటఁ గల్పించుకొనుచుందును.

ఈ సందర్భమున 'ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా' యన్న చేమకూరి వేంకటకవి మాట నించుక యనాదరింపవలసి వచ్చినందునఁ బ్రాజ్ఞులు మన్నింతురుగాక. నే నేగతి రచియింతునో చెప్పఁజాలనుగాని, సమకాలీనుల వాత్సల్యమునకు గురియైతినని చెప్పికొను పుణ్యము నాకుఁ గల్పించిన తెలుఁగువారికి నేను గృతజ్ఞుఁడను. ఎవరో యొకరిద్దరు బుద్ధిమంతుల మాట నిటఁ దడవనేల?

శ్రేయమునకు విఘ్నములు మిక్కుటముగదా ? ఈ గ్రంథమున కంతరాయము లెన్నో కలిగినవి, నేఁడు తొలగినవి. నా రచనలు తెలుఁగు పొలమున నీషణ్మాత్రమైనను జైతన్యము గలిగింపఁజాలినచో, నా కిఁక నేమి కావలయును ? "గడనకెక్కిన యాంధ్రపుత్రుఁడను నేను మదమద్రిప్పని యాంధ్రవీరుఁడను నేను" అని వాకొన్న నాగీతము, నావాణి శాశ్వతకీర్తిని నాకు సమకూర్పఁగలదు. నిరతిశయానంద సామ్రాజ్యమున కధినేత నయ్యెదను.

మఱొక మనవి. ఇందలి పద్యములు, భావములు, జాతీయములందందు, గవికుమారులు తమ వ్రాఁతలలోఁ బ్రయోగించుకొనుచున్నారు. తొలతనుండి నా రచనలు భారతిం దిలకించు రసజ్ఞులందలి ముందు వెనుకలను గమనించి సత్యమును నిర్ధారింతురు గాక. నిర్భరానందమున నే నీ కృతిని బరిచితాంధ్రలోకమునకు సమర్పించుకొనుచున్నాను. దీని నెన్ని భాగములుగా నరసి యానందింపఁగలదో నా తెలుఁగు తల్లి భారము తనదిగాని నాది గాదు. భిన్నభిన్న శీర్షికలు గల నా యీ కావ్యకుసుమదళములను గుత్తిగట్టి తన జననీజనకుల కంకిత మిప్పించి సరస్వతి కొప్పున నుంచు నవకాశముఁ గల్పించిన ప్రాడ్వివాకశిరోమణులును గుప్తదానశౌండులును గుంటూరు వాస్తవ్యులు నగు మ.రా.శ్రీ ఏకా దండయ్య పంతులుగారికి నమస్కారములు.

గ్రంథకర్త.

# వి జ్ఞ ప్తి

పాఠక మహాశయులకు—

ఇది నా ఖండకావ్యము ప్రథమ భాగము. ఈ కావ్య మాంధ్రుల ఆదరాభిమానములను పరిపూర్ణముగా చూఱలాడి నేటికి ఏడుమార్లవతరించినది ఇది ఎనిమిదవ కూర్పు. స్వతంత్రతా స్వర్ణకిరీటధారిణియై విజ్ఞానచైతన్య శక్తులచే విరాజిల్లు నేటి తెలుగు నాటిక రసికతాక్షామ ముండదని ఆశించుచున్నాను.

మ. వెనుకన్ దీటిన కోరమీసములకున్ బేరేమియున్ లేదు రా
జిన కోపానలమెల్ల నాతనువునన్ జీర్ణించి వమ్మయ్యె నీ
దిన మాంధ్రోర్వికిరీటధారిణి యనర్ఘీభూత రాజన్యశా
సన భీతాహము గోచరించ దిక నాశబ్ద ప్రపంచంబునన్"

అని మహోదయ పుణ్యకాలాన

యాంధ్ర కవుల దివ్యలేఖినుల నుండి ప్రసవించు స్వేచ్ఛా సత్యకావ్యములు ప్రతిఆంధ్రుని పరిచయమున కగ్గమై యింటింట నృత్య మొనర్చుగాక.

గ్రంథకర్త.

# అంకితము

శ్రీమదాత్రేయగోత్రీయుఁ డార్వేలని
యోగి భూసురుఁడు గుంటూరువాసి
ఏకాన్వవాయంబు హీరహారమునందు
వెలుగొందు సురవైన కొలికిపూస
దానంబులోఁ గ్రొత్తదారిఁ ద్రొక్కిన దాత
ఆడంబరములేని న్యాయవాది
కులమువారలు పెంచుకొను ప్రతిష్ఠాభర్మ
హంసి కాయువుఁ బోసినట్టి ఘనుఁడు

వసుధ గ్రుంగినఁ బట్టిన పట్టువిడని
ఆధునిక భగీరథుఁడు దండార్యమౌళి
అట్టి ప్రాజ్ఞుని జనయిత్రి కంకితమయి
నా కవిత్వంబు చిన్నారినవ్వు నవ్వె.

# విషయసూచిక

# భరతమాత

సగరమాంధాత్రాది షట్చక్రవర్తుల
యంకసీమల నిల్చినట్టి సాధ్వి
కమలనాభుని వేణుగానసుధాంబుధి
మునిఁగి తేలిన పరిపూత దేహ.

కాళిదాసాది సత్కవికుమారులఁ గాంచి
కీర్తినందిన పెద్ద గేస్తురాలు
బుద్ధాదిమునిజనంబుల తపంబున మోద
బాష్పము ల్విడిచిన భక్తురాలు.

సింధుగంగానదీజలక్షీర మెపుడుఁ
గురిసి బిడ్డలఁ బోషించుకొనుచు నున్న
వచ్చి బాలెంతరాలు మా భరతమాత
మాతలకు మాత, సకల సంపత్సమేత.

# కృతిస్వామిని ప్రశంస

శ్రీ యేకాన్వయరత్న భూషణము, లక్ష్మీసుప్రసన్నేక్షణ
చ్ఛాయాభాసితుఁడైన దండయను భాషాపోషకుం బున్నెముల్
బూయన్ గాంచిన రుక్మిణీసతి నెదం బూజించి, యే నంకితం
బీయం బూనితి నస్మదీయకృతి బ్రాహ్మీదేవతాప్రీతిగన్.

ఏలోకంబున నుంటివో, సుగుణవల్లీ ! రుక్మిణీదేవి ! యిం
దాలంబం బిసుమంత లేని కృతికన్యాజాలముం బ్రేముడిం
బాలింపంగల పుత్రరత్నమును సంపన్నుం బ్రసాదించినా
వీలోకానకు, నీబుణగ్రసిత మయ్యెన్ దెల్గుసాహిత్యమున్.

మును నీవిచ్చట నిల్పిపోయిన యశోమూర్తిం బ్రపూజించి యీ
తెనుఁగుం గబ్బము ఖండగీతికలు భక్తిన్ నీకు నర్పించితిన్
వనితాలోక విలాసభూషణమ ! సుబ్రహ్మణ్యు నిల్లాల ! చ
క్కని నీ దివ్యచరిత్ర మత్కృతికి బంగార్నీరు వోయించుతన్.

వీసు వాక్కాంతయులేక నాధుని మనోవీధిం బ్రవర్తించి, సా
రసనేత్రాసముదాయ నిర్మలశిరోరత్నంబు నాఁగీర్తి పె
ల్లెసఁగెన్ డెబ్బదినాలుగేండ్లు మని, ప్రాణేశాంఘ్రి పద్మస్థలిన్
బసుపుం కుంకుమతో గతించితివి నీ భాగ్యంబు సామాన్యమే.

ఒకనాఁడు నీచంకనుండి నీ ముద్దుల
జలకంబులాడిన చంటివాఁడు
ఒకనాఁడు నీ పెట్టు నోగిరంబు భుజింప
మారాముచేయు బంగారుకొండ.

ఒకనాఁడు నీచిత్తమూగ 'నమ్మా' యని
పలుకరించిన నీదు భాగ్యరాసి
ఒకనాఁడు నీదేహ మువ్వొంగ నలనల్ల
నుడువ నేరిచికొన్న కడుపుఁబంట.

దండయాగ్రణీ, నీకూర్మి తనుభవుండు
ఖండకావ్యంబు కృతిని నఖండభక్తి
నంకితంబుగ నిప్పించె నందికొనుము
తనువు పులకింప, హస్తపద్మములు సాఁచి.

కెలనన్ నీతనుజన్మతోడ సహపంక్తిన్ పంచభక్ష్యాలతో
గలమాన్నంబు భుజించు బాలకుల మూకం జూతువో! వారు పే
దలు, విద్యార్థులు కట్టుబట్టములు విత్తం బిచ్చి పోషించి, దా
తలలో దాత యనం బ్రసిద్ధి వడసెన్ దల్లీ! సుతుం డిద్ధరన్.

సంపాదించిన విత్తము
సంపాదన మూని సకల సత్కర్మల వె
చ్చింపం బూనిన దండయ
పెంపుం దెగువయును గల యభిజ్ఞులు గలరే?

కఱు కొక్కించుక పలుకుల
మెఱుపవలెం దోఁచుగాని మెత్తని వెన్నన్
దిరిసెనపుఁ బూలగుత్తిం
దొరయు న్నీసుతుని హృదయతోయజ మబలా!

ముచ్చట సెప్పుచో నడుగఁ జోయినవాని హృదంతరాళమం
దిచ్చునో; యీయఁడో; యని యొకించుక సంశయ మంకురించు దా
నిచ్చిన నేస్గుపాడియసుమీ! తినువాని లలాట రేఖలోఁ
బొచ్చెముగాక, నీ సుతునిఁ బోలు వదాన్యులు లేరు మానినీ!

ఊరక వెట్టిగా నొసఁగి యుత్తమయుక్తమనాక, పేరుకై
బారలు సాఁచఁడన్నిట శుభంబని తోఁచినఁగాక, యిచ్చుచో
నేరివియున్ సిఫారసు లొకింతయు గిట్టివు, రుక్మిణమ్మ! యే
తీరునఁ గంటి, విట్టి యొరదీసిన కత్తిని, భక్తసత్తమున్?

రేయింబవ లొరులకు మే
ల్సేయవలయు ననెడు నమలచింతయె కానీ
నీ యాత్మజునకు మఱి వే
రే యోచన లేదు శర్వరీనాథముఖీ!

కొమరుని ధర్మకార్యముల పోషణమున
మొలిచె, మేల్కిరితి మొగలితోఁట
సుతుఁడు గట్టించు ప్రోన్నత సత్రశాల
మొరసె యాత్రికుల కిన్నెరల వినుతి.

తనయుండు ద్రవ్వించు ఘనతటాకములలోఁ
జెలఁగు బేడిసమీల చెంగనాలు
తనుజుండు నెఱపు సంతర్పణంబులలోన
నిండెఁ బేదల కేల నేతిజిడ్డు.

నందనుని వదాన్యత రంగనాథు నెదుటఁ
బ్రహరితోఁ గూడ నొక మంటపంబు మొలిచె
దైవభక్తుల పెనుజాబితాలయందు
బ్రథమమునఁ జేరె నీ కన్నవాని పేరు.

తన జన్మస్థలిఁ బ్రత్తిపాటిపురి సత్రం బొండు గట్టించి, బావినిఁ ద్రవ్వించి, పురాణమున్ జరుప నుర్వీనిర్జర శ్రేష్ఠు నొక్కని నిల్పె న్నెలజీత మిచ్చి, ఘనభక్తశ్రేణి దండాభిధాను నిగీర్తింతు రనారతంబు; నది నిన్నున్ ధన్యుఁ గావింపదో?

సమదృష్టి నేత్రయుగమున
సముద్భవము నంద నిత్యసత్యవ్రతుఁడై
కొమరారు సుతుని శిరమున
సమరులతోఁ గురిసియు మమ్ము యాశీస్సుమముల్.

కులశీలరూపగుణముల
కలాపమగు రుక్మిణమ్మగారి సరస ని
మ్ముల నేగతి మెలఁగెదొ! యొ
ప్పులకుప్పా! నాదు కబ్బపుం గ్రొమ్మొలకా!

పతికి సతి సతికిఁ బతి యను
నితాంతధర్మంబుఁ దలఁచి నీ కొమరుఁడు ని
పతి నిటువలె నా రెండవ
కృతిపతిఁ గావించె, మోదమేకద నీకున్,

మేలిగుణాలకుం బసిఁడిమేడ, దయాపరురాల, దొడ్డయి
ల్లాలు కుమారమానవిభవాఢ్యులఁ గాంచిన చల్లనమ్మ, స్వ
ర్గాలయరత్నదీప మయి యంబరవీథుల నాడు రుక్మిణీ
శీలవతీలలామగళసీమకు మత్కృతి జాజిదండయా.

సువినీతుండగు నీదు కూరిమి తనూజుం, డార్ద్రచిత్తుండు, భూ
దివిజశ్రేష్ఠుఁడు, దండయాభిధుఁడు, ముద్రింపించినాఁడమ్మ, రెం
డవపర్యాయము ఖండకావ్యకృతి నానందించి నీవేల్పుబం
దువు లగ్గింప ధరింపుమమ్మ! గళమందున్ రుక్మిణీగేహినీ!

కట్టించెన్ వ్యయ మెగ్గడింపక, సభాగారంబుఁ గీర్తిద్యుతుల్
మిట్టాడన్ మొనమొన్న గుంటురఁ గళాలీలానివాసంబుగాఁ
బట్టుం దీక్షయు దూరదృష్టియు, ననల్పత్యాగముం గల్గు నీ
పట్టింజూచి తెలుంగుకాళ్యపి సగర్వస్ఫూర్తి శోభిల్లెడిన్.

# గిజిగాఁడు

జిలుగుం బంగరురంగులం గులుకు మేల్చిన్నారి పూగుత్తి సొ
మ్ములు గీలించిన తుమ్మకొమ్మలకు నీవు న్నీ సతీరత్న మూ
యెలగీమున్ దగిలించి రేఁబవలు హాయిందూఁగరాగాడ్పు వీ
డ్గలు మీ కూడిగ మాచరింప, గిజిగాఁడా నీకు! దీర్ఘాయువౌ.

తేలిక గడ్డిపోఁచలమ దెచ్చి, రచించెద వీవు తూఁగుటు
య్యేల గృహంబు. మానవుల కేరికి సాధ్యముగాదు. దానిలో
జాలరు, అందులో జిలుఁగు శయ్యలు నంతిపురంబు లొప్పఁగా
మేలు భళీ ! పులుంగుపెకిమీదవురా గిజగాఁడ ! నీడజా !

కులుకు పసిండినిగ్గులదుకూలములన్ ధరియించి ముద్దు బి
డ్డలును, బడంతి నీపొదిగిట న్నిదురింపఁగఁ గన్నెగాడ్పులూ
యెల సదనంబు నూఁచ, భయమింత యెఱుంగక కన్ను మూయు నీ
యలఘుసుఖంబు మాకుఁ గలదా ? గిజిగా ! యొక టేని కున్నదా ?

అందమున నీకు నీడగు నందగాడు
గృహవినిర్మాణమున నిన్ను గెలుచువాఁడు
వైభవంబునఁ బోలు దేవతల లేదు
లేఁడురా గిజిగా ! మొనగాఁడ వోయి.

నీ గిజిగాని నామకము. నీ తెలివిం బ్రకటించు గూడు నీ
మైఁగలసోయగం, బవని మానవకోటికి ముద్దుసేయు నో
యీ ! గిజిగాడ ! భీతిలకు మీవు ధరాతలి నున్న బిట్టుగా
వాగెడు నాస్తికు ల్తలలు పంతు రనంతుని చెంత ఖిన్నులై.

# సాలీఁడు

నీలో నూలు తయారుజేయు మర గానీ, ప్రత్తిరాట్నంబు గా
నీ, లే; దీశ్వరశక్తి నీకడుపులోనే లీనమై యుండునో
యేలీలన్ రచియింతు వీజిలుఁగునూ లీపట్టు పుట్టంబు లో
సాలీఁడా! నిను మోసగాడవని విశ్వం బేల ఘోషించెడిన్?

ఢక్కామల్లుపసందు నేతపనివాండ్రా, నీ యుపాధ్యాయు? లి
ట్టొక్కండున్ గనరాఁడు, డాఁగుకొనినారో? నీదు గర్వంబునం
దిక్కాలంబున నిన్ను మించు పనివాఁడే లేఁడు, దుర్వృత్తికిన్
దిక్కై, నీ యసమానకౌశలము వ్యర్థీభూతమై పోయెడిన్.

పురువుంగుంపును మోసపుచ్చుటకుఁ గాబో ల్దొంగమగ్గాలపై
మురిపెంపుంబని యుల్లి పట్టువలిపంబుల్ నేసి, నీ మందిరాం
తర దేశంబున నారఁగట్టి యొకపొంతం బొంచినా, వోరి ట
క్కరి సాలీఁడవుగావు, దొంగవని వక్కాణింపవే లోకముల్.

తలఁపం బున్నమనాటి వెన్నెలల దిద్దంజాలు నీ నూలుపో
గుల సింగారముఁ జూడవచ్చి, యనువుగ్గోల్పోయెడిన్ బ్రాణులో
తులువా! నెత్తురు ద్రావు నేఁతపను లెందుం జూడ మోరంత ప్రౌ
ఢ్ధులు నీకీ యుదరంభరిత్వ మనుకొందుం బెండ్లముం బిడ్డలున్.

ఒకపర్యాయము, కాందిశీకుఁడగు వీరోత్తంస మొక్కండు కొం
డకు నీ వల్లిన గూటియం దొదిగియుండన్ దాయ లేతెంచి, నీ
మొకమోటంబున నమ్మి నీదు నిలయంబున్ దొంగియుంజూడ రిం
దుకు నిన్ను గ్గొపియాడి యీశ్వరుని వైదుష్యంబు నూహించెదన్.

## నెలబాలుఁడు

గగనకల్యాణి గండభాగమున నిడ్డ
కాలపురుషుని గురునఖక్షతముఁ బోలి
మంచునవ్వుల నదె చందమామ బుడుత
జననమైనాడు పశ్చిమశైలశిఖరి.

నిండుపున్నమనాటి కీ నీటుకాఁడు
కళలు పదియారు నేరిచి గర్వపడును
అమరులు భుజింతు రితని దేహమును గమిచి
యమపసకుఁ గానరాఁ డీతఁ డల్పజీవి.

కుముదము తేనెతో నెదురుకొన్నది పూజకు, చందమామ యం
దముగలవాఁడు చుట్టమని నాలుగు దిక్కులనుండి సర్వలో
కము తలయెత్తి పిల్ల నెలగానికి వందన మాచరించె, సాం
ద్రము లగు వీని చూపు లమృతంబును జిందును శీతలంబులై.

చుక్కపొలంతి నీకొలకు స్రుక్కుచునున్న దమాసనుండి కెం
పెక్కిన కన్ను మూసికొనియెం గుముదంబు, నిశావధూటి, నీ
చిక్కని మంచు వెన్నెల భుజించు చకోరము కంటినీరు న
ల్దిక్కులఁ జిమ్ముచున్నది మదించి జగంబును గ్రమ్మెఁ జీఁకటుల్.

పున్నమనాఁడు నీవు పరిపూర్ణ శరీరుఁడవై సుధావిలా
సోన్నతి నవ్వుచుం బొడముచుందువు లోకము సంతసింప నో
క్రొన్నెలజాల యారుపదిరోజులజీవికి నవ్వువచ్చునే ?
యన్నము వట్టునే ? పరమహితార్థివి నీకు విచార మున్నదే ?

అదిగో ! సింహికపట్టి నీ తెరవునం దడ్డంబుగా నిల్చి నీ
రదకుంజంబున నక్కినాఁ, డతని దంష్ట్రల్ క్రూరముల్ సుమ్మ నీ
మృదుదేహంబును గాసిపెట్టుకొని యిట్లెన్నాళ్లు లోలోన గ్రు
శ్ళెద వన్నా ! ధరణీ హితార్థము నిశాలీలావతీ వల్లభా !

## నెమిలినెలఁత

తలపై గల్కితురాయి, కంఠముననిద్దాతళ్కు గ్రొమ్మెల్క ప
చ్చలహారంబు ధరించి కాటుకవిలాసం బొప్పు వాల్గంటి తె
ప్పల నానందము నింద, నర్తితనిజప్రాణేశ్వరుం జూచు, నె
మ్మిలరాణీ ! యిటు చూడవే నుతిశతంబుల్ నీకు నీ భర్తకున్!

పొన్నుం గన్నులు నెత్తికెక్కఁ గులికింపుం గంతగర్వంబునన్
నిన్నున్ని చెలికత్తెలం బ్రణయకంధి న్ముంచి తేలింప; నీ
సాన్నిధ్యంబున నాట్యమాడు పతిపజ్జన్ బారవశ్యంబునన్
గన్నుల్ మోడ్తువు నిచ్చలు న్నెమిలిచానా యెంత పుణ్యాత్మవో !

కోరిన పాపటోగిరముఁ గూరిచి నీమది పల్లవింపఁ జి
న్నారి మనోజ్ఞషడ్జమనినాదము ల న్నిను బుజ్జగించు, బం
గారపుఁ గంటికుల్కుల మగండు మహేంద్రునియంతవాఁడు, నీ
చేరువ నాడెడి న్నెమిలిచేడియ ! నీకుఁ గొఱంత గల్గునే !

ఉఱుముఱిమెందఱుక్కుమనుచున్నది మించను మోసకత్తె యం
బరమున మబ్బు లేలినవి, మంజుల కేంకృతు లొప్ప నీ మనో
హరుఁడుఁ బింఛదీధితుల నారతు లీయఁ దొడంగెఁ గేకిసుం
దరి ! పొదరిండ్ల తీవెపరదాలమఱుంగునఁ జెంగలింపవే !

భర్త హొంబట్టుజిలుఁగు టంబరము దాల్చి
విపినవీధులలోఁ దాండవించుచుండఁ
జేరువను నిల్చి మాసినచీరఁగట్టి
మురిసికొను పతివ్రతవు సుందరులలోన.

# తుమ్మెద పెండ్లికొడుకు

కొండల నందు గుంజిగురుఁగొమ్మలు మేసి మదించు భద్ర వే
దండకపోలదానజలధారలఁ దానము లాడఁబోయి, యు
ద్దండకఠోరకర్ణములు దాఁకిన మూర్ఛిలితో ! మరేల రా
కుండెద ? వీ విలంబనము నోర్చునె ? తేఁటిపడంతి, షట్పదా !

కూరిమి పల్లవింప నదిగో సుదతీమణు లెల్ల నీ ముఖాం
భోరుహదర్శనార్థమయి పుప్పొడి పుట్టములన్ ధరించి, కా
సారనికేతనాంగణ విశాలతలంబుల విశ్రమించి యు
న్నా రిక రాకయున్న దహనంబునఁ గ్రుంగెదరోయి షట్పదా !

కాకులు కూసినంతన, యెకాయెకి నిద్దురనుండి లేచి, మా
ధ్వీకము దొంగిలింపఁ బరువెత్తితి; వబ్జహితుండు గ్రుంకునం
దాఁక. సుధాధనాపహరణం బొనరించెద వేలనోయి ! నా
ళీకవనంబు కన్ను ముకుళించిన నీగతి యేమి ? షట్పదా !

తమ్ములచుట్ట మస్తగిరి దాఁగె మృగాంకుఁడు తూర్పుకొండ నె
త్తమ్ముల కెక్కె, చిక్కని సుధారసభుక్తిఁ జకోరబంధుబృం
దమ్ముల కిచ్చె, నింతవరదాఁక గృహమ్ముఁ దలంపవేల ? నీ
తుమ్మెద పెండ్లికూఁతుల నెదుర్కొనరాఁగదవోయి, షట్పదా !

పూవులు దాఁచుకొన్న మధువుందనివోవఁగఁ గ్రోలి యింటికిం
దేవలె నన్న యాస, నలుదిక్కుల కెక్కెడు నీ చరిత్రయం
దేవ జనించి, పద్మవనమెల్ల మొగంబు మరల్చె. నిట్టి తృ
ష్ణావిలబుద్ధి తమ్మిచెలి కంపకపోవదు నిన్ను షట్పదా!

మొన్న వివాహమాడితివి, ముద్దుపడంతులఁ బెండ్లియైన యం
త, న్నవమల్లికామధువనంబులఁ జొచ్చితి, వెంతకాల మీ
క్రొన్ననతీవెజొంపములఁ గూతలువెట్టెద? వింకనైన రా
కున్న, జగంబు మెచ్చదనియుం దలపోయ విదేల? షట్పదా!

బంగరుపూవుటిండ్ల తలవాకిలిఁ ద్రొక్కని బిచ్చగాని, ని
న్నుం గని నవ్వుచుండు సుమనోనిచయం బిదియేటి వింత? నీ
యంగన కంఠమం దలరదా? యలనాటి సువర్ణసూత్ర మో
భృంగకుమారకా! కుదువఁ బెట్టవుగా? మధుమద్యపాయివై.

# దీర్ఘనిశ్వాసము

తెలుఁగుం బాసకు వన్నె దెచ్చిన జగద్వీరుండు, మా కృష్ణరా
యలు గట్టించిన వజ్రదుర్గముల, శుద్ధాంత ప్రదేశంబులన్
దలక్రిందైై. తప మాచరించెడిని సంతానార్థమై, గబ్బిగ
బ్బిలపుం గుబ్బెత లక్కటా మొయిలుగప్పెం బూర్వమర్యాదకున్

పన్నీటన్ దలసూపి కాపుగాను రంభామల్లికావాటికల్
జిన్నాదేవి గులాబితోఁటలు నశించె; స్వచ్ఛ. ఋమ్మెత్తలున్.
గన్నేరుంబొద లావరించినవి, రంగత్తుంగభద్రానదిన్
బన్నుండె న్మనమోహనాంగి కవితాప్రాగల్భ్య సౌరభ్యముల్.

నాయకురాలి మాయకదనంబున, మా పలనాటి పౌరుష
శ్రీయడుగంటె, గడ్డి మొలిచెం బులిచాఱలగద్దెమీఁదఁ, గెం
జాయ మొగానఁ గ్రమ్మ జలజప్రమదామణి నాగులేటిపై
వ్రాయుచునున్న దిప్పటికి, బాలుని శౌర్యకథాప్రబంధముల్.

వాసిని గన్న రెడ్ల పరిపాలన, కొండలదండలన్ శిలా
శాసనసంగతి న్నిలిచి, చప్పయుఁ జావదు, రెడ్డిరాణి మైఁ
బూసిన కుంకుమంబుఁ బసుపుంబస లంటిన కన్నె తొండ, నేఁ
డూసరవెల్లియై నవయుచున్నది పండు వెదుళ్ళసందులన్.

## శల్యసారథ్యము

అహిమస్త్రములకు లొయ్యారంబు నేర్పించు
పలపుఁ బిల్లనఁగ్రోవి పాటగాఁడు
పసితనంబునయందుఁ బడగపాముల నెక్కి-
చిందులాడిన గొల్ల చిన్నవాఁడు,

# మొదటి భాగము

పదియాఱువేల గోపస్త్రీలతో నుండి
యపకీర్తి నందని యందగాఁడు
లోకాంతమున మఱ్ఱియాకుఁ దెప్పం దేలి
తలదాఁచుకొన్న చిత్రస్వరూపి.

భాసురములైన తన చేరెఁడేసి కనుల
మచ్చుఁ జల్లెడు వేలుపు మాంత్రికుండు
తొడరి విజయుని యరదంబుఁ దోలుచుండె
కాంచ విల్లందుకొనుము భాస్కర కుమార!

ములుకులు నీ ధనుస్సున విముక్తములై చని కృష్ణమూర్తికిన్
వలఁగొని యావల న్నరునిపైఁ గసిబూనుట దుస్తరంబుగా
గలఁప విదేటి వెఱ్ఱి? భుజదర్పము వెన్నునిముందు సాఁగునే?
మలపుదు నారథంబు' అనుమానము దోఁచె జయంబు కర్ణుడా?

వ్యయమైపోయిన యమ్ములన్మరలఁ గూర్పన్ దక్షమైయున్న య
క్షయతూణీరము విచ్చి పార్థుఁడు శరాసారంబు గుప్పించినన్
జయ మాదేవుఁ డెఱుంగు గుఱ్ఱములపై నాపై భవత్సేనపై
దయజూపించుట కూపిరాడగలదా? యా దౌర్భాగ్యధానుష్కుఁడా.

తూలిన పందికై హరుఁ డెదుర్కొని రేచిన గ్రుద్దులాట కు
స్తీల బలిష్ఠుఁడై కఱకు దేలినవాఁడు మహేంద్రసూతి, యా
శూలికి గుండెలే దతనిఁ జూడ నెగాదిగ యుదభూమిలో
రాలఁ దళించితో? పరశురాముని శిష్యుడ నన్ను బిఱ్ఱునన్.

బలవంతుండగు శౌరి రోషము రగుల్పం బార్థుఁడున్ గెంపుఁజూ
పుల వేగంబునఁ దూపుల న్నడిపి నీ మూర్ధంబు ఖండింపఁడా !
తలపై శాపములాడు నీకు నొక యుద్ధం బేల ? నీ రక్తమున్
బొలయున్ గాకులు గ్రద్దలుం గుడుచునేమో ! నేఁడు సూతాత్మజా !

ఖాండవము నర్జునుఁడు గాల్చు కాలమందుఁ
బరువులెత్తిన ముసలిసర్పమును వింటఁ
దొడిగినాఁడవు గాఁబోలు విడువ వలవ
దబ్జనాభుఁడు గరుడవాహనుఁడు నుమ్మ.

ఇలకున్ గ్రుంగె రథంబు చక్ర మిపు డేదీ నీకు గత్యంతరం ?
బలుక న్నీ ప్రతిపక్షి, గాండివధరుండై, చెంత నున్నాఁడు నీ
బలమున్ గాలము లేదు స్యందనము లేవందీసికా; మ్మేటికీ
తలపోఁత ల్మరణంబు వేఁడుకొనరాదా కర్ణ ? బీభత్సునిన్ !

# భారతవీరుఁడు

ఘన కురుక్షేత్ర సంగ్రామ గగనమునకు
భానుమంతుఁడవై, వైరివర్గములను
కలఁచి, గెలిచిన దండిమగండ వీవు
కర్ణ ! కారణ మేమి దుఃఖపడ నింక

సమరధర్మంబు విడి ధనంజయుఁడు సంపె
నతనిచేఁ జచ్చె రాధేయుఁ డనెడు పల్కు
పుట్టెనను చింత కలదు కాఁబోలు నీకు
నట్లు కాదయ్య! గెలుపు నీయదియె కర్ణ?

ధర్మముఁ దలఁచి, నినుఁ గన్న తల్లి ననుఁగు
సోదరుల రేణువులభాతిఁ జూచినాఁడ
వౌర నీ స్వామిభక్తి నీ యద్వితీయ
సుగుణసంపద వర్ణింప నగునె కర్ణ!

వీరాగ్రేసర! నీవు పాండవబలాబ్ధిన్, మందరం బట్లు, దో
స్సారంబార మథించి, యంచితయశస్సారంబు, లోకంబునన్
బారంజల్లిన సద్ధనుర్ధరుఁడ వెవ్వం డీడురా నీకుఁ? గ
ర్ణా! రాజన్యుల కెల్ల నీసరిత మన్నన్, గర్ణ పేయం బగున్.

కింకన్ రుద్రునిఁబోలి, తేరి, నడుచక్కిం జేరి, దృప్యద్ధను
ష్టంకారం బొనరించుచున్, విమతకంఠశ్రేణిఁ జెండాడు, నీ
వంకన్ జూడఁ గిరీటియంతటి ప్రతాపస్ఫారమార్తాండుఁడే
జంకె, న్నె కెదురెక్క వీరుఁ డొకఁడు న్గన్పించునే? భానుజా!

జననంబందిన తక్షణంబ, కఠిన స్వాంతంబునన్, గంగ క
ప్పనగావించిన క్రూరురా లనగ, లోభస్వాంతయై, కుంతి 'న
య్యన! కర్ణా! సుతభిక్షరా' యనఁగ నాహా? మారుమాటాడ కి
చ్చినవిఖ్యాతవదాన్యమాన్యుఁడవు పొచ్చెం బేది నీకీర్తికిన్?

అరదము గ్రుంగిపోయినపుడైనను, భార్గవరాము శాప వా
క్సరణి, శరంబు లూహ కెడ సన్నపు డేనియు, శల్యుఁ డెన్ని ని
ష్ఠురములు వల్కుచున్న, రణశూరత దక్కక, వైరివీరకం
ధరపటుకర్తనోద్యమమునం, జెలువారవె? సూర్యనందనా!

ఒక పాంచాలికి భర్త లేవురని, మత్స్యేల్ గూడి మాటాడు వా
డుక, యే కర్ణకఠోరమై మసలుచుండున్ డెందమం, దట్టివా
నికి నా కాఱవ భర్తృనామము ధర న్నిర్మింప కంచు న్మరా
రికి వాక్రుచ్చి యశంబుఁ జాటవె? ధరిత్రీమండలిన్ భానుజా!

పార్థనామంబు చెవిలోనఁ బడినయంత
భగ్గుమని మండిపోవు నాపాదమస్త
కంబు నీ కట్టి మీఁదైర కారణంబు
చాటుచున్నది కర్ణ! నీ స్వామిభక్తి.

'చండగభస్తిమండల మొసంగిన నా తొలిచూలికాన్పు క
ర్ణుం'డను కుంతి మాటకుఁ దనూలత కంపమునంద ధర్మసూ
నుం డెలుఁగెత్తి యేడిచి, నినుం గొనియాడుచుఁ బల్కె "నట్టి శూ
రుం డిఁక పుట్టబోఁ"డని నిరూపణచేయుచు సూర్యనందనా!

చెవుల న్గుండలముల్ ప్రభావిభవరాజిన్ జిమ్మ వర్మంబుఁ బు
ట్టువుతోఁ గల్గిన ముద్దుబిడ్డడవు, నీటుంగోటు దీపింప? రెం
డవ మీనాంకుఁడువోలి విల్లుఁగొని జన్యక్షోణులం జొచ్చి, శా
త్రవనాశం బొనరించు నిన్నుఁగని కర్ణా! కుంతి యెట్లోర్చెనో?

మివులఁ బవిత్రవంతమయి మేదినిఁ గాలువ గట్టి మర్మరా
రవము నెలంగ నీదు రుధిరంబు స్రవించుచు "అర్జునా ! యధ
ర్మమువు. భవ" యంచు నెంత వలపోసెనొ శత్రు కళేబరంబులం
టవలనె నంచు నెంత వనటం బడినాఁడవొ కర్ణ ! కూలుచోన్.

నరుఁడు బృహన్నలాఖ్య నలనాఁడు విరాటుని గొల్చుచుండి యు
త్తరునకు సాయమై కురుశతంబును మూర్ఛలఁగొట్టునాఁడు భా
స్కరసుతుఁ డోడె నందు రని కన్నుల నీ రిడకయ్య ! శక్తులై
గురుఁడు నదీసుతుం డెదురుకొన్నది లేదుగదయ్య భానుజా !

# బుద్ధమహిమ

సరవి న్నీ కడకంట వెల్గిన యహింసాజ్యోతికిన్ గొండలున్
గఱఁగింపంబడె వెన్నపూసలవలెన్ క్ష్మామండలంబెల్ల నీ
చరణాబ్జంబుల ముద్దుగొన్నది, మహీశ గ్రామణీ జ్ఞానభా
స్కర ! బుద్ధప్రభు ! నీ సుధోక్తులను సంస్తంభించె ముల్లోకముల్.

నీవల రావిచెట్టునకు నేర్పిన భూతదయారసోక్తిలో
భూవలయంబు బాష్పజలపూరితలోచనమయ్యె, బింబిసా
రావనిభృత్సభా భవన మార్ద్రమనస్కతఁ గ్రుంగిపోయె, నీ
పావనబాహుపీఠమునఁ బ్రాణము దక్కిన గొఱ్ఱెపిల్లతో

పాములు గాలిఁ మేత లలవా టొనరించుట కీవు కారణం
బేమొ త్రిదండిరాజపరమేశ్వర ! నీదు పదాంకముద్రలోఁ
జీమయు హాయిగా నిదురజెందిన; దెక్కడి దీ యకారణ
ప్రేమ ? జోహారు నీ నయనవీథులఁ దాండవమాడు శాంతికిన్.

కటికకసాయివాని చిరుకత్తియు నెత్తురు సూడలేదు, నీ
చరణరజంబు సోకిన రసాతలసీమలలోన నిప్పుడు
ర్వారఁ బెకళించి చూచు ప్రతివానికి నీ మహనీయ విగ్రహో
త్కరములు దర్శనం బిడు నఖండదయారస దిగ్ధముద్రలన్.

దీనములైన చూపుల వధించెడువానికి మ్రొక్కి "అన్న ! నా
కూనల కండ లేదు కనుగొమ్మ"ని గద్గదనిస్వనంబుతో
లోనఁ దపించి నాల్గుదెసలుం బరికించుచు బుద్ధదేవ ! రా
వే ! నను బ్రోవవే ! యని జపింపని జంతువు లేదు మేదినిన్.

పైకొని రెండువేలయిదువందలయేండ్లు వయస్సు వచ్చియున్
నీ కమనీయబోధలకు నిగ్గు రవంతయుఁ దగ్గలేదు, హిం
సాకరణంబు పాపమను శబ్ద మశోకుని ఱాతిగుండెలన్
దాఁకి, యగల్చి, యాదినమునన్ గదలించెడి నష్టదిక్కులన్.

# భీష్ముఁడు

వృద్ధవీరుఁడ ! నీవయస్సెంత చెపుము ?
తండ్రి మరణించియే మూఁడు తరములయ్యె
నౌర ! భారతయుద్ధమధ్యంబునందు
పడుచు పార్థునిఁ దల్లడపరచినావు.

కోడెవయస్సు నిన్నలమి గోటికి మీసము చిక్కునాఁడు, ము
య్యేదిరునాళ్ళు పోరు వెలయించిన భార్గవరాముఁ డెంత య
ల్లాడెనో ! మూడుగాళ్ళ ముసలయ్యవు నేఁటి కెదిర్చి కృష్ణుఁడున్
గ్రీడియుఁ, దల్లడిల్లి రవని న్నిను గెల్చు మగండు పుట్టెనే ?

"వెలిమావుల్ రుధిరంబు గ్రక్కెఁ, గతిదప్పెం దేరు, సంధించు న
మ్ములతో గాండివమూడె, సాఁగవు కరంబుల్, బావ ! ఆలంబు న
వలగాదంచు ధనంజయుండు కనులన్ బాష్పంబుల న్నింపఁడే ?
బలమో లేక మహత్త్వమో యిది తలంపన్ రాదు గంగాసుతా ?

అరయ నీవు ధర్మజున కాయువు పట్టెటిఁగింపకుండినన్
శౌరియు సవ్యసాచి, మఱునాడు రణంబున నిల్తురే ? కృపా
పారగ ! నిక్కపుం గినుక పైకొని నీవు ధనున్నుఁ బట్టినన్
నీరయి పోవె లోకములు నింగి గుభిల్లునఁ గూలిపోవదే ?

అంబ, శిఖండియయ్యె నతఁ డాడుది, వాని మొగంబుఁ జూచనం
చుం, బరిపూర్ణ పౌరుష విశుద్ధికి భంగము గల్గకుండ వి
ల్లంబులుఁ జారవైచితివి యర్జునవీరుని కీర్తి నిల్ప గం
గాంబిక ధన్యయయ్యెనుగదా ! నిను గాంచి, ధనుష్మదగ్రణీ !

గురువు గొడ్డలిఁ ద్రిప్పుకొని తప్పుకొనుదాఁక
మరలి వెన్కకురాని మార్గణంబు
ముత్తరంబులనుండి ముదిరి ముద్దలుగట్టి
చేవడిందని పచ్చి యౌవనంబు
వసుసప్తకము సానఁబట్టి జీవము వోసి
యొసఁగు కక్కసపు టాయుధబలంబు
స్వర్గతరంగిణీ స్తన్యంబు బలిమి
సంప్రాప్తమైన తేజశ్చయంబు.

గవ్వకుం గాని పాడుశిఖండిముందు
వ్యర్థవుచ్చితె పార్థుని పరువుకొఱకు ?
జగము నగలించు నీ దివ్యశంఖరవళి
పవ్వళించెనె యమ్ములపడకమీద ?

కౌరవుని యాస గంగలోఁ గలసిపోయె
పరశురాముని వేడి నిశ్వాసములకు
వింద్రగిరి క్రాఁగి బూదియయ్యెను గదోయి
శంతనకుమార ! నీ విల్లు జారిపోవ.

# రా జ రా జు

నిన్నుఁ బోలు మహీనేత నిక్కువముగఁ
బుట్టెనో ? పరాశరదివ్యముని సుతుండు
మున్ను మాతాత, పరిహాసమునకుఁగాను
కల్పనము చేసి వ్రాసెనో ! కౌరవేశ !

మా తాత సత్యవంతుఁడు
పూతములగు నాల్గు వేదములు వ్రాసిన వి
ఖ్యాతకవీంద్రుం డాతని
చేతికల మబద్ధములు వచింపదు సుమ్మీ !

వ్యాసకల్పిత మహాభారతామ్నాయంబు
గుట్టుగా నినుఁ దిట్టుకొనుచునుండ
ముగురు సత్కవుల పెంపుడు కావ్యరాజంబు
పదిమందిలో బట్టబయలు సేయ.
నింతలంతలు సేయు దృశ్యప్రబంధాళి
మొత్తమై నిన్నాడిపోసికొనఁగ
చెప్పుడుమాటకు జెవి యొగ్గి భువనంబు
క్రూరాత్ము డని పండ్లు నూరుకొనఁగ,

తొడలు తెగిన బాధతో నింత దుష్కీర్తి
తోఁ బరాజయంబు తోడురాఁగ
నరకమునకుఁ బోయినావో ! స్వర్గమునకుఁ
జేరినావో ! నీవు కౌరవేంద్ర !

నీ సాహసముచేసి ముజ్జగముఁ బిండింజేయఁగాజాలు రా
ధాసూనుం డొక వ్యర్థజీవి యయి నిందాబద్ధుఁడై పోయె నీ
యాసల్ భీముగదాభిఘాతమునఁ నుగ్గై యూరు యుగ్మంబుతో
నీ సింహాసనసీమ దుఃఖప: పండె న్నేఁడు కన్నీళ్ళతో !

సవ్యసాచికరాన సాము నేరిచికొన్న
బలమైన కొవ్వాఁడి బాణములకు
వాయుసూనుని బాహుబలముతోఁ బోరాడు
మొక్కవోవని పుట్టె డుక్కుగదకు
పాంచాలి నులివెచ్చ బాష్పాంబువులఁ దేలు
వజ్రనిష్ఠుర శాపవాక్యములకు
యమతనూభవుని దీనాలోకములఁ దోలి
దీపించు శీతలాలాపములకు.

సకల భువనంబు లాలించి సమ్మతించు
వనజనాభుని శుభ రాయబారమునకు
సమ్మతింపక రక్తనిర్ఝరములందుఁ
దానమాడితి వేల ? గాంధారితనయ !

అంటఁగరాని యగ్ని కెనయైనది ద్రౌపది యట్టి సాధ్వి ప
య్యంట మొగాన బూని, యకటా యని యశ్రులు రాలనేడ్చినన్
దుంటరివై, సహోదరులతో సభలోనఁ బరాభవించినా
వంట మఱందివై వదినకా ? మొనగానితనంబు సూపుటల్.

కురుభూపాలుఁడు బుద్ధిమంతుడని వాకోబూనితింగాని యా
దరణీయంబులు హేతువు ల్గలుగవద్దా ? నీ చరిత్రంబునన్
గరళాన్నంబును, మాయజూదమును, లాక్షాగేహమున్ ద్రౌపదీ
పరిభావంబు, భయంకరంబులయి చూపట్టుం, గురుక్ష్మాపతీ !

నీయతనంబు లన్నియును నెత్తురుకూడు భుజించి మాయమై
పోయెఁగదా ? వృథాపయశముం దలదాల్చిన నీకు నేఁడు నిం
డాయువుఁ బోసినారు కవు, లక్కట ! పెందొడలూడి, కుంటివై
యీ యవమానజీవితము నెట్లు సహింతువయా ! సుయోధనా !

## శ్మశానవాటి

ఎన్నోయేండ్లు గతించిపోయినవి గానీ యీ శ్మశానస్థలిన్
గన్నుల్ మోడ్చిన మందభాగ్యు డొకఁడైనన్ లేచిరాఁడక్కటా
యెన్నాళ్ళీ చలవంబు లేని శయనం బేతల్లు లల్లాడిరో !
కన్నీటంబడి క్రాఁగిపోయినవి, నిక్కం బిందు పాషాణముల్.

ఆకాశంబును కాఱుమబ్బుగము లాహారించె, దయ్యాలతో
ఘూకంబుల్ చెరలాడసాఁగినవి వ్యాఘోషించె నద్దిక్కులన్
గాకోలంబులు గుండె ఝల్లుమనుచున్నంగాని యిక్కాటియం
దా కల్లాడిన జాడ లే దిచట సౌఖ్యం బెంత క్రీడించునో !

ఇచ్చోట నేసత్కవీంద్రుని కమ్మని
కలము, నిప్పులలోనఁ గఱఁగిపోయె ?
యిచ్చోట నేభూము లేలు రాజన్యుని,
యధికారముద్రిక లంతరించె ?
యిచ్చోట నేలేఁత యిల్లాలి నల్లపూ
సలసౌరు గంగలోఁ గలసిపోయె ?
యిచ్చోట నెట్టిపే రెన్నికం గనుఁగొన్న
చిత్రలేఖకుని కుంచియ నశించె ?

ఇది పిశాచులతో నిటాలేక్షణుండు
గజ్జె గదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌ దృష్టు లొలయ
నవనిఁ బాలించు భస్మసింహాసనంబు.

ముదురుతమస్సులో, మునిఁగిపోయిన క్రొత్తసమాధిమీఁదఁ బై
బొదలు మిణుంగురుంబురువు పోలిక, వెల్గుచునున్న దివ్వె, ఆ
ముద ముడివోయినన్, సమసిపోవుట లేదది దీప మందుమా ?
హృదయమునుమ్మి, నిల్చ చనియె న్గతపుత్రిక, యేయభాగ్యయో

కవుల కలాలు, గాయకుల కమ్మని కంఠము, లీ శ్మశానపుం
గనులఁ ద్రొక్కి చూచెది నొకానొకనాఁ డల కాళిదాస భా
రవుల శరీరముల్, ప్రకృతిరంగమునం దిపు డెంత లేసి రే
ణువులయి మృత్తికం గలిసెనో కద! కుమ్మరివాని సారెపై.

ఆలోకించిన గుండియ ల్గరఁగు, నాయా పిల్లగోరీలలో
నే లేబుగ్గల సౌరు రూపతియెనో! యేముద్దు నిద్రించెనో!
యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో?
యీలోకంబున వృద్ధిగాఁదగిన యేయే విద్య లల్లాడునో?

ఇట నస్పృశ్యత సంచరించుటకు దావేలేదు, విశ్వంభరా
నటనంబున్ గటిశించి, గర్భమున విన్యస్తంబు గావించి, యు
త్కటపుం బెబ్బులితోడ మేకఁ నొకప్రక్కన్ జేర్చి జోకొట్టి యూ
అటఁ గల్పించు నభేదభావమును, ధర్మం బిందుఁ గారాడెడిన్.

వాకొన్నరాని గొప్ప ధనవంతుని నిద్దపుఁ బాలతాతిగో
రీకడఁ బారవేయఁబడి ప్రేలికలం బొరలాడు ప్రేత, మే
యాకటిచిచ్చునన్ గుమిలి, యార్చి, గతించిన పేదవాని దౌ
నో కద! వానికై వగవఁ డొక్కఁడు దాఁచదు కాటినేలయున్.

# శి శు వు

బొటవ్రేల ముల్లోకములు చూచి లోలోన
నానందపడు నోరులేని యోగి
తల్లిదండ్రుల తనూవల్లరీద్వయికి వ
న్నియఁబెట్టు తొమ్మిది నెలలపంట
అమృతంబు విష మను వ్యత్యాస మెఱుఁగ కా
స్వాదింపఁ జను వెఱ్ఱిబాగులాఁడు
ఆనుభవించుకొలంది, నినుమడించుచు మరం
దము జాలువాఱు చైతన్యఫలము

భాష రాదు, వట్టి పాలుమాత్రమె త్రాగు
నిద్రవోవు, లేచి నిలువలేఁడు,
ఎవ రెఱుంగ రితని దేదేశమో కాని,
మొన్న మొన్న నిలకు మొలిచినాఁడు.

గాన మాలింపక కన్ను మూయని రాజు
ఆంబ కౌఁగిట పంజరంబు చిలుక
కొదమకండలు దేరుకొను పిల్లవస్తాదు
ఉయ్యేల దిగని భాగ్యోన్నతుండు

ఊఊలు నేర్చిన యొక వింత చదువరి
పతిని ముట్టనినాటి సాంబమూ_ర్తి
ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి
తనయింటి క్రొ_త్తపె_త్తనపుదారి

ఏమిపనిమీఁద భూమికి నేగినాఁడొ!
నుఁ వ నేర్చిన పిమ్మట నడుగవలయు
నేండ్లు గడచిన ముందు ముందేమొకాని
యిప్పటికి మాత్ర మేపాప మెఱుగఁ డితఁడు.

నవమాసములు భోజనము నీర మెఱుఁగక
పయనించు పురిటింటి చాటసారి
చిక్కచీఁకటిఁ జిమ్మ జేనెఁడు పొట్టలో
నిద్రించి లేచిన నిర్గుణుండు
నునుఁ జెక్కిళుల బోసినోటి నవ్వులలోన
ముద్దులు చిత్రించు మోహనుండు
అక్షయంబైన మాతృక్షీర మధుధార
లన్నంబుగాఁ దెచ్చుకొన్న యతిథి

బట్టఁ గట్టడు, బిడియానఁ బట్టుపడఁడు,
ధారుణీ పాఠశాలలోఁ జేరినాఁడు
వారమాయెనో! లేదొ? మా ప్రకృతికాంత
కఱపియున్నది వీని కాఁకలియు నిద్ర.

ఉ॥ యేలతొట్టి యే ముపదేశ మిచ్చెనో
కొసరి యొంటరిగ నూకొట్టుకొనును
అంబతో తన కెంత సంబంధ మున్నదో
యేడ్చి యూడిగముఁ జేయించుకొనును
పరమేశ్వరుం డేమి సరసంబు లాడునో!
బిట్టుగాఁ గేకిస గ్గొట్టుకొనును
మూన్నాళ్ళలోన నెప్పుడు నేర్చుకొనియెనో!
బొమ్మన్నచోఁ జిన్నబుచ్చుకొనును

ముక్కుపచ్చ లారిపోయి ప్రాయమువచ్చి
చదువు, సంధ్య, నేర్చి బ్రదుకునపుడు
"నాదు పసిడికొండ నారత్న" మని తల్లి
పలుకు పలుకు లితఁడు నిలుపుకొనునె?

తనచేతి గిలకపండునకు ముచ్చట నెప్పు
బలుకలే దనుచుఁ గోపంబు సేయు
పొరుగింటి యిల్లాలి సరసఁ జీఁదరఁ జెంది
పరు లన్న భేదభావమును జూపు
మకరందమునకు సమ్మతి జూఁపి నోరూరి,
దరిఁజేరి, రుచుల భేదములు తెలియు
ప్రతిశబ్ద మీను నుగ్రధ్వాన మాలించి
కంపించి తల్లినిఁ గౌఁగలించు

దాయ లార్గురు నౌకరు నిద్దరును దప్ప,
చేరుకొన్నార లీఁని చిత్తవీథి
జగతి నీతని జాతకచక్రమందుఁ
బొంచియుండున దపయశఁబో యశంబొ।

# బాష్ప సందేశము

ఆలోకింపు మొకింత భారతకుమారా! నిండు పెద్దమ్మచే
గాలింపంబడి, దుమ్ముచే మలయు నంగశ్రేణి దూల న్నిరా
శాలంబంబున, నీ మహోన్నత సుధాసౌధంబు క్రీనీడలం
దాలుం బిడ్డలు బిచ్చమెత్త, నిరతం బల్లాడు మానుష్యమున్.

నీ సోదర్యులు వారు, కారనుచు సందేహింతువో? వీరి స్వే
చ్ఛాసామగ్రి గతించి వత్సర సహస్రంబుల్ సనెన్, దీని కీ
వే, సాక్ష్యంబును, గారణంబు, నిపుదేమీ మించిపోలేదు, ఆ
శ్వాసింపం గదవయ్య, భారతతనూజా! ప్రాంత చుట్టంబులన్.

కుడుము నొసంగఁ బండువనుకొందు, రమాయకు లిప్పుడైన నీ
మడఁలును, మాన్యము ల్పసిఁడి మూడువు లిమ్మన; రింటనుండు పెం
పుడు పసరంబు లట్టులు మముం గణియించిన జాలునంచు, నీ
యడుగుల నంటి దీనముగ నంజలిఁ బట్టిరి ధర్మభిక్షకై.

అనుఁగుం దమ్ములు దిక్కుమాలి పురబాహ్యక్షోణిఁ గారాడ హె
చ్చిన సౌభాగ్య సువర్ణమందిర సమాసీనుండవై, హాయిగా
గనుమూయం దగవా ? పరాకుపడి యింక న్మేలుకొమ్మీ ధరా
జనయిత్రీమణి తమ్ముఁ గుఱ్ఱలకు స్వేచ్ఛాభిక్ష లర్థించెడిన్.

ఆనందంబున నీ సహోదరులు విద్యాస్వీకృతిం జెందినా
రీనాఁ డల్లదె, శుభ్రపత్రములతో నేతెంచుచున్నారు నీ
తో నిత్యోచిత దైవపూజకని, సంతోషంబునన్ జేర నీ
వేని, న్నీ వొక రాక్షసాకృతివి సుమ్మీ ! భారతీనందనా !

కరుణావీరుఁడు భారతీయుఁడని దీర్ఘవ్యాసముల్ వ్రాసి నీ
కొరకై వైరికి వెన్నుజూపని యనుంగుం జుట్టముల్ వీరు, దు
ర్భరదాస్యంబు సహింప నోప రనుకంపం బూననౌ వింక, నీ
తరళాపాంగము పేరుగన్నది యభూత న్యాయతాదృష్టికిన్.

కారుణ్యంబున నంతరావితనమున్ ఖండింపవా ? యీ నిరా
ధారవ్యక్తుల ఘోషణంబు వినరాదా నీకు ? నాంగ్లేయులన్
మా రాజ్యం బిఁడుడంచు వేఁడ కొనుచున్నా విట్టి నీ కిత్తురా ?
ప్రారంభంబున నిన్ను దిద్దుకొనుమయ్యా ! కోర్కె సిద్ధించెడిన్.

కరమింపారెడు నీ విభూతికి శిరఃకంపంబుఁ గావింపవా ?
పరదేశంబులు పూర్వ మీదినము నీ స్వార్థక్రియాపేక్ష, సో
దర విద్వేష మెఱింగి, యూతి విఱచున్ దద్దేశముల్ నీ యశోం
బరమున్ జిమ్మటఁ గొట్టుచున్న, దీఁక విప్పంబోలు నేత్రాబ్జముల్.

"మా ముత్తాతలనాటినుండి నిను సన్మానించి నీకోసమై
మా మేనంగిల రక్తబిందువుల సంపత్తి న్సమర్పించినా;
మేమో, నీ హృదయంబులో నెనరు లే దీషత్తు, నింకెన్నఁ డ
న్నా! మాకష్టము గట్టునెక్కు" ననుచున్నారేమి వాక్రుత్తువో!

## తెలుఁగుతల్లి

కృతు లందుటకు పల్లకీ మోయ దొరఁకొన్న
కృష్ణరాయఁడు రాజ్య మేలు నాఁడు
మనుమసిద్ధియును దిక్కన గన్న కావ్యంబు
కోరచూపులు జూచుకొన్ననాఁడు
తెలుఁగురాయని యొప్పు లొలుకు గుప్పిటలోన
లేఁతకస్తురి గుబాళించునాఁడు
ముత్యాల మందిరంబుల సత్కవులమీఁద
బంగారు మేరులై పారునాఁడు

కవుల పల్కులు వేదవాక్యంబు లగుచు
క్షితితలంబును గంపింపఁ జేయునాఁడు
గారవంబున నన్నేలఁ గాంచవైతి?
తెలుపఁగదవమ్మ! ననుఁ గన్న తెలుఁగుతల్లి!

ఆలసానికులజుఁ డూయెలమంచములనుండి
పసిఁడిలేఖినిఁ బూని వ్రాయునాఁడు
పోతనార్యుని గేహమున భారతీదేవి
చిగురుఁ జేతుల వంటఁ జేయునాఁడు
భువనభీకరుఁడు వేములవాడ భీమన్న
గంగ్రాజునకు జోరెఁ గట్టునాఁడు
శ్రీనాథకవి పాండితీ నైపుణము మీఱ
డిండిమభట్టు నోడించునాఁడు

కనులఁ జూచెడు భాగ్యంబు గలిగియున్న
నేఁడు నా కవిత్వంబు రాణించియుండు
గారవంబున నన్నేలఁ గాంచవైతి ?
తెలుపగదవమ్మ ! ననుఁ గన్న తెలుఁగుతల్లి !

పసుపుముద్దల నుంచి పతికి రోసముఁ బోయు
వీరపత్నులు పుట్టి పెరుగునాఁడు
ప్రతిన దప్పక వైరిపక్షముల్ పెకలించు
వెలమ బెబ్బులులు జీవించునాఁడు
కాళిందిలోఁ గత్తి గడగి, తల్లికిఁ జూపు
శివరాజు పగతుఱ జెండునాఁడు
తమ్మిమొగ్గరము లుద్ధతిఁ జీల్చికొనిపోవు
పిల్లవిల్కాండ్రుద్భవిల్లునాఁడు

పిడికి నెత్తురు నాలోన వెలయ దేమొ;
రంభ, నాపేర నుత్తరాల్ వ్రాయు నేమొ;
గారవంబున నన్నేలఁ గాంచవైతి ?
తెలుపఁగదవమ్మ ! ననుఁ గన్న తెలుఁగుతల్లి !

అలఘు దాతల దానజలధిలోపల మున్గి
పెద్దమ్మ కన్నీరు విడుచునాఁడు
శరణాగతత్రాణ బిరుదంబు రాజుల
వెడదఱొమ్ములమీఁద వెలుగునాఁడు
అన్యకాంతల మోములందుఁ బూరుషజాతి
కన్నతల్లులమూర్తిఁ గాంచునాఁడు
సహజపావనమైన సర్వసమత్వంబు
ప్రతినేత్రమునఁ జాలువాఱునాఁడు

వారి కబ్బిన కీర్తి సంపత్తిలోనఁ
గొంతలోఁ గొంత నేఁ బంచికొందు నేమొ;
గారవంబున నన్నేలఁ గాంచవైతి ?
తెలుపగదవమ్మ ! ననుఁ గన్న తెలుఁగుతల్లి !

# శిల్పి

చేత మిగురొత్తు నొక నల్లజాతియందు
మలఁచినాఁడవు, భయద సింహములఁ జిలలు
వసుధ గన్పట్టు సర్వపర్వతములందుఁ
జిత్రముల నెన్నిగతుల జూచెదవో ! నీవు.

సున్నితంబైన నీచేతి సుత్తెనుండి
బయలువడె నెన్ని యెన్ని దేవస్థలములు
సార్థకము గాని యెన్ని పాషాణములకుఁ
గలిఁగె నీనాఁడు పసుపుఁగుంకాలపూజ.

కవికలంబునఁ గల యలంకార రచన
కలదు కలదోయి శిల్పి ! నీ యులిముఖమునఁ
గాకపోయినఁ బెనుజాతికంబములకు
గునుమవల్లరు లేరీతి గ్రుచ్చినావు ?

ప్రతిమలు రచించి యొక మహారాజు చరిత
వల్లెవేయింపఁగలవు చూపరులచేత
గవనమునఁ జిత్రములు గూర్చు కవికి నీకుఁ,
దారతమ్యంబు లేదబద్ధంబు గాదు.

జాల నిద్రించు ప్రతిమల మేలుకొలిపి
యులిని సోఁకించి బయటికిఁ బిలిచినావు
వెలికిరానేర్చి, నీపేరు నిలుపుకున్నె
శాశ్వతుఁడ వోయి నీవు నిశ్చయముగాను.

తలయెత్తెన్‌గద, నీదు చాతురి యజంతాగహ్వరశ్రేణిఁ గే
వల పాషాణములందు, జీవకళ నిల్పంజాలు నీసుత్తెలో
మొలుచు న్మానవ విగ్రహంబులు మహాపుణ్యుండవయ్యా ! హరి
త్తులు, నీ బొమ్మలచెంత, ముగ్ధగతి నందున్, శిల్పికంఠీరవా !

నునుపుల్ దీర్చి, మదంబు చిందిపడ నేగ్గున్ గున్నలన్ జెక్కివై
చిన చాతుర్యము నీ శిరోగ్రమున నిల్చెన్, సత్కిరీటాకృతిన్
తెనుగుందేశము నిన్నువంటిపనివానిం జూచి, యుప్పొంగుచుం
డును నీలేమిఁ దలంచి కంటఁ దడిఁబెట్టున్ శిల్పవిద్యానిధీ !

తెలిజాతన్ జెలువార నచ్చరపడంతిం దిద్ది యా సొగక
న్నులపజ్జన్ నిను నీవు దిద్దుకొని, సంతోషించుచున్నాఁడవా !
భళిరే ! శిల్పి ! జగంబులోనఁ జిరజీవత్వంబు సృష్టించుకోఁ
గల నీ కెవ్వఁడు సాటివచ్చును ? నమస్కారంబు నీ ప్రజ్ఞకున్.

# ఇం టి గె లు పు

శ్రీరాముఁ డేకొండశిఖరానఁ గన్నిట
నాలించె సీతాపహరణ గాధ
దాటించె నేవీటిదాపున నైతమ్మ
పట్టి, మేల్పొట్టేలి వాహనంబు
కోటకొమ్మలమీఁద గ్రుచ్చినా రేవీటి
తెలుఁగురాజులు విరోధుల శిరాలు
ముత్యాలతో నారఁబోసినా రేవీటి
నృపతు లేపేటఁ బండిన యశస్సు

భాస్కరుని దానధార లేపట్టణంబు
చారు చరితకు బంగారునీరు వోసె
అట్టి వినుకొండ కడుపునఁ బుట్టుకతన
ధన్యుఁడను నేన యుత్తమోత్తముఁడ నేన :

ఇంగువ గట్టిన గుడ్డవ
లెం, గీరితి కప్పురంబు లేశములు, చరి
త్రం గోచరింప, నిప్పుర
మంగు దొలఁగి కాలదండహతి నిట్లయ్యెన్.

ఏ నివు డన్యదేశమున నెట్టి మహానగరాన నున్న, స్వ
స్థానముఁ జేరుచో, నగుచు స్వాగతమిచ్చు నగంబుమీఁది యీ
శానుని దివ్యమంటపము చాయలు, ప్రోన్నతమైన టిప్పు సు
ల్తాను మసీదు గుబ్బల విలాసము, లేశము విస్మరింతునే!

ఏ కాలంబుననో నశించినవి, మున్నీలాటి సత్కారపుం
బోకిళ్ళీపురి నస్తమించె జరమాంభోరాశిమార్తాండుఁడున్
శ్రీకాంతుండు పునఃప్రతిష్ఠఁ బొనరించెన్ గ్రమ్మఱన్, దెల్గుభా
షాకల్యాణి! పచారి సేయుము జయేచ్ఛం బంచకల్యాణిపై.

సకు లింటన్ గెలిపించినార, లిఁక రచ్చం గెల్తు నెందేని, సా
ర్థక మయ్యెం గవితాపరిశ్రమ, విధూతం బయ్యెఁ జింతాతమ
శ్శకలంబుల్, దొలికోడిగూసిన దుషస్సంధ్యారుచిం దేలుమా
మకపూర్వాశ జనింపఁడో చిఱుత సంపత్సూర్యుఁ డింపారఁగన్.

జననంబందితి మీ సమక్షమున, మీ సాన్నిధ్యమందాడి నాఁ
డనుగోలీలు బజారుదుమ్ము మొలనంటన్ బాలురం గూడి యీ
వినుకొండన్ గనుగొన్న, నాహృదయ మావేశంబునం బొంగిపో
వును మీ రిచ్చిన నీయకున్న సహజంబుల్ భక్తితాత్పర్యముల్.

నా నిశ్చేయము విన్నవింతు వినుఁ డాంధ్రక్షోణి పొంగార మీ
వాని న్నన్ను బహూకరించితిరి, లోపంబింత రాకుండఁగా
నీ నూరారులు వెండినాణెములు, వేయిన్నూరు బంగారు సో
పానాలైనవి, మీ యశస్స్మృతి వసింపంబోవు సౌధానకున్.

పోయె నమాసరే, లిపుడు పున్నపువెన్నెల వచ్చె యుల్లమున్
గోయిలపిట్టయై, తెలుఁగుకొమ్మ తల న్నివసించె, హాయిగాఁ
గూయకపోవునే, చిగురుకోకలతోడ వసంతలక్ష్మియున్
డాయఁగవచ్చెఁ, బుష్పవదనంబునఁ బ్రేమమరంద మూరఁగన్.

## రాజదర్శనము

మానిత రావు వేంకట కుమార మహీపతి సూర్యరాయ భూ
జాని ! హసాదు, మీ స్థిరవిశాలవితీర్ణికి, నేను నేఁడు పెం
పూను కవిప్రపంచమున నొక్క మిణుంగురుబుర్వు నున్నతిన్
గానక సంచరించెడు నొకానొక పేదను వృద్ధికాముఁడన్.

అల దిగ్దంతులవంటి పండితుల కావ్యాంభోధులం దూర్మిళ
య్యల నుయ్యాలలనూఁగు మీచరణదివ్యద్దర్శనార్థంబు రా
దలఁకె న్నా కవితాకుమారి నరనాథా ! ముద్దరా లేమి సొ
మ్ములతో రావలెనో ? యెఱుంగదు, భయంబున్ దీర్చి మన్నింపవే.

శరణం బిచ్చిరి నా యనాథకవితాచంద్రాస్య నీక్షించి, ము
గ్గురు శ్రీమంతులు వర్ణఖండనవిదగ్ధుల్, వారి యాలంబన
స్థిరత న్నేఁడొక యింటిదై నిలిచి, పోల్చెన్ గాని లేకున్న బం
ధుర సన్యాసము బుచ్చుకొన్నదయి యుండున్ సూర్యరాయాధిపా !

స్మరణీయుండగు సిద్ధిరాజనుగు మామా ? యంచుఁ దిక్కన్నతో
నెఱపెన్ జుట్టఱికంబుఁ, గ్రొత్తదను సందేహంబు లేదో మహీ
వర ! మన్నింపుము సాహసోక్తులు, కవిత్వప్రాప్తిమై, నేను ద
గ్గఱచుట్టంబను రావవారికను దీక్షాలేశ ముండు న్గదా ?

అతిమనోహర భావనాకాశపథమునఁ
బ్రాలుమాలక పల్లటీలు గొట్టి
శైరీషకుసుమ కేసరపుగుత్తిని మొత్తు
మెఱుఁగు శయ్యలమీఁద మేనువాల్చి
యుపలంబులోఁ జెమ్మ లూరించు కమ్మని
వ్యంగ్యవీచిక లెక్కి పరువు లెత్తి
చిరకాలమునఁ బుట్టి చివికిపోయిన ప్రాత
భూషణంబులు చూచి మూతి విఱచి

గ్రంథరూపంబుఁ దాల్చు భాగ్యంబు లేక
కంటఁ దడివెట్టుచుండు నా కవనపటిమ
ఏమి సేయుదుఁ బ్రోచు రాజేంద్రుఁ డేడి ?
కర్ణుఁ డేమాయెఁ గుణపరీక్షకులనడుమ ?

సాంగోపాంగముగా రచించితిని భాషాశుద్ధి, మారాటఠా
సింగంబైన శివాజిరాజుకథ, శ్రీ శ్రీశైలపత్యాహ్వాయుం
డంగీకారమునన్ వరించె, నవనీశా ! కోరినన్, దానిమై
సింగారంబు నొకింత నూపెదను దాక్షిణ్యాక్షి నర్పింపవే !

మనుచారిత్రము, కృష్ణభూవిభుఁడు సన్మానించు నయ్యేలపా
న్పున మృష్టాన్నములందుఁ గప్పురపుఁ దాంబూలంబులం దంకురిం
చిన యానందరసంబులోఁ బొటమరించెన్ భూపతీ ! పొట్టనిం
డని మాబోంట్ల కలంబు లెక్కరణి విన్నాణంబుఁ జూపించెడిన్ ?

నా కవితావధూటి వదనంబు నెగాదిగఁ జూచి, రూపరే
ఖాకమనీయవైఖరులు గాంచి "భళీ భళి !" యన్నవాఁడె "మీ
దేకుల" మన్న ప్రశ్న వెలయించి, చివుక్కున లేచిపోవుచో
బాకునఁ గ్రుమ్మినట్లగును పార్థివచంద్ర ! వచింప సిగ్గగున్.

# గుంటూరు సీమ

శ్రీనాథకవి శిరస్సిచు నట్టువఁ ద్రొక్కు
దీనారములకు మదింపుగట్టి
బాలచంద్రుని లేఁత పచ్చలపిడిబాకు
మొలిపించు యశము గాదెలకుఁ బోసి
యెఱగడ్డపాటిలో నొఱిఁగిన తెలుఁగు మ
ప్నీల శౌర్యంబు మానికలఁ గొలిచి
వేమన్నయోగి గుప్పిన జాలువాకైత
తులము వేయివరాల విలువ చెప్పి

భాస్కరుని దాన ధారా ప్రవాహ సమితి
నబ్ధినాథునకిడి వివాహం బొనర్చి
పేరుమోసిన వీర గుంటూరు క్షితికి
నతు లొనర్పని యాంధ్రమానసము గలదె?

ఱాలకు వన్నెనిచ్చు నమరావతి శిల్పుల నేర్పు పెంపు, దే
వాలయగర్భముల్ వొగడ, నభ్యుదయంబునఁ గృష్ణవేణిలో
వాలుగచేప తళ్కులకు వంకలు దిద్దిన సుప్రతిష్ఠలోఁ
దేలిన రెడ్డిరాజుల సతి స్తుతియింపని, భూము లున్నవే?

అల కృష్ణాజలధార, పెంపకము సేయం బండు, బంగారుతీ
గల మాగాణులు పట్టుచీరలయి శృంగారింపగాఁ, బూర్వరా
జుల దోశ్శౌర్యము లుగ్గడించెడు రణక్షోణీస్థలుల్, రత్నభూ
షలుగాఁ బొల్చెడు వీరభూమినిఁ బ్రతిష్ఠాజ్యోతి వెల్గించెదన్.

కళఁతన్ జెందిన తొంటి నాగరికతాగంధంబు జీరంగి తె
క్కలి రైకల్ ధరించి, మోటుసొగసుల్ గైసేయు నాసామి క
న్యలతో డాఁగుడుమూతలాడఁగని యానందించు గుంటూరుమం
డలముం గన్నుల కద్దుకొన్నవి, కవీంద్రస్వర్ణ బద్యావళుల్.

తలపోయం గవిసార్వభౌముని మరందస్వాదు కావ్యంబు ల
ప్పలనాటంగల జొన్నబువ్వకు, గురుత్వప్రాప్తిఁ గల్పించి, పూ
విలుకానయ్యకుఁ గూడఁ గొంత రుచిఁ జూపెం దింత్రిణీపల్లవం
బులతో బచ్చలికూర, చిత్రములు మద్భూమీ చరిత్రాంశముల్.

# సమదృష్టి

ఖద్దరుబట్టఁ గట్టికొని, కన్నుల నీరము చిందిపొలి, నీ
ముద్దుకుమాళ్లతోఁ జెలఁకుఁబోయెద వేటికి ? తల్లి! పూర్వపుం
బెద్దఱికంబుఁ దెచ్చుకొని పిల్లలతో సుఖియింతు నందువా ?
వద్దు, వృథావ్యథల్, భరతభామిని! వింధ్యధరాధరస్తనీ!

పూర్వకాల చరిత్రముల నిద్రితమ్ములైన
శుభదినంబులు లెక్కఁజూచుకొనుచు
భూగర్భమున రత్నములలోనఁ గలసిన
గడుకు వీరుల కౌఁగిలిచికొనుచు
చెదపుర్వు పొట్టలో జీర్ణించిపోయిన
వాఙ్మయంబునకు వివాదపడుచు
గజవాహనములపై గజనీకిఁ బోయిన
పసిఁడికి గుండెలు బాదుకొనుచు

పొట్టనింపుల నాటకంబులఁ జరించు
కొడుకులకు స్వేచ్ఛ లేదని కుందె దేల!
స్వేచ్ఛ లేకేమి సోదర ద్వేషమునకు ?
తిరిగి చూడుము నట్టింటి దెబ్బలాట.

కలమున గీ_ర్తిశేషులకుఁ గాయము లీయ సమర్థులైన బ్ర
హ్మలు కవిరాజు, లట్టిడుల కన్నము లేదుగదమ్మ! దేశభా
షలు విలపించుచున్నవి, విజాత్యభిమానము చెంగలించె, నో
చలిమల మేల్కొమంగు దొరసాని! కుమారుల దిద్దుకొందువా?

విమల తపంబునం బురిటి బెబ్బులికంటి కహింస నేర్పు, సం
యములను గన్నదానవుగదా? జననీ! భవదీయ పుణ్యగ
ర్భమున నగ_స్త్యసోదరులు భ్రాతృవిరోధులు పుట్టిరేలనే?
అమరనదీదళత్కమలహార! యచంచల ధర్మగామినీ!

సమవ_ర్తిప్రియసూనునేత్రయుగళిన్ సందీపితంబైన ధ
ర్మముతూర్యధ్వనిఁబోలి భారతకథామధ్యంబునన్ మ్రోయునా
సమభావం బిపుడేది? స్వార్థయుతవాచారూపముం దాల్చె, నో
సమశీతోష్ణ సుఖప్రదాయిని! అహింసాలోచనోద్భాసినీ!

చక్కని కవితకు కులమే
యెక్కువ తక్కువలు నిర్ణయించినచో, నిం
కెక్కడి ధర్మము తల్లీ?
దిక్కుం జరవేదికాప్రతిష్ఠితగాత్రీ!

# పశ్చాత్తాపము

మును తెరచాటునన్ జరిగిపోయిన కర్ణుని జన్మగాథ యే
మని వివరింతురా! శమనజా! యతఁడే, భవదగ్రజుండు, నా
కును రవికిన్ జనించి, ధృతిఁ గోల్పడి డాగిన మందభాగ్యుఁ డ
య్యనఘుని యెంగిలిన్ గుడిచియేకద పొల్చె, భవచ్ఛరీరముల్.

భాస్కరసుతుండు, నాదు గర్భమునఁ దొలుతఁ
గునికి నిద్రించి లేచిపోయిన నయంత
రమునఁ బొడమిన లేఁతదేహములు మీవి
వాని జ్యేష్ఠత్వమే నీకు వచ్చె నన్న!

ఎందుకు గంటినో; తెలియదీ యినబింబసమానమూర్తి, నా
క్రందన మాచరించు కసుగాయను, కుండలమండితాంగుఁగా
శింది కౌసంగితిన్ జవుకళించెడు దుఃఖముఁ గ్రుక్కుకొంటి, నీ
కుందు గతించునే! తలచుకొన్న సహించునె? మాతృగర్భముల్?

"నీ కన్యాత్వము మొక్కవోదు విను కుంతీ!" యంచు నేరీతి వ
న్నాకొట్టించెనొ భానుమంతుఁ డొక విద్యుత్సన్నిభాంగుండు ది
వ్యాకారుం డుదయించెఁ బుత్రుడు కుమారా! వాఁడె కర్ణాఖ్యుఁ డి
ట్లేకాకింబలె నయ్యె వీని మృతి కేనే హేతువున్, ధర్మజా!

కానీనుం డను వెచ్చనైన పలు కాకర్ణించి, లజ్జాముఖుం
డై, నన్నేమి శపించియుండునొ; తనూజా ! "దానకర్ణుండ వ
న్నా ! నాకొంగున భిక్షపెట్టు" మని నే నర్థించినన్ నవ్వి, ఆ
హా ! నన్నుం గృతకృత్యుఁ జేసిన విధం బాత్మం బ్రపీడించెడిన్.

అకటా ! యెన్ని దినాలు దాతును గుమారా ! ధర్మజా ! మర్మభే
దకమై పొంగులువారు కర్ణుని చరిత్రం బానిరాలంబ జీ
వికి, మీయన్నకు స్వర్గసౌఖ్యములు గల్పింపంగదోయీ ! తిలో
దకదానం బిడి కొంత నాదగు మనస్తాపంబు చల్లారెడిన్ ?

## క్రీస్తు

నిను వెన్నాడి నభంబునం దమలకాంతిం జిమ్ము నక్షత్రమున్
గని, రాజన్యులు తల్లడిల్ల మరి యాగర్భంబునం బుట్టి బొ
ట్టనవ్రేల్చీకుచు బేతలేమః పురి గోష్ఠంబందుఁ బన్నుండు చ
క్కనివాఁడా ! ఎవరయ్య నీవు ? పరలోకం బింపు నర్తించెడిన్.

తొలి నీదర్శనమిచ్చి గొల్లలకుఁ జేతోమోదముం గూర్చి జ్ఞా
నుల రావించి పసిండికానుకల సందోహంబుచే నంది యె
ద్దులకొట్టంబునఁ దొట్టిలో నొక దరిద్రుం బోలి నిద్రించు ము
ద్దులతేఁడా ! ఎవరయ్య నీవు మొరసెన్ ద్యోవీధిఁ దూర్యధ్వనుల్.

"పరమంబైన విశుద్ధవర్తనమదంభ ప్రేమయున్ దాల్మియున్
మరియాకన్యకుఁ జిట్టిపాపడువలెన్ జన్మించె" నంచుం బసుల్
గరమన్యోన్యము ముచ్చటించుకొను లీలన్ నిక్కి 'అంబా' యటం
చఱగెం బుచ్ఛము లూఁచి నీకెలకులందాలానబద్ధంబులై.

ఒకచెంపఁ గొట్ట వేఱొక చెంపఁ జూపించి
పరమశాంతము స్పష్టపరచునాడు
పరుల నిన్నుంబోలి భావించి మన్నించి
ప్రేమపుష్పము సమర్పించునాడు
పేద సుంకరియింట విందులో భుజియించి
సమదృష్టి మహిమంబుఁ జాటునాఁడు
శుభ్రాంశుకమున శిష్యుల పాదముల నద్ది
నమ్రభావము నుత్వి నాటునాఁడు

నీవు నిలిచిన పున్నెంపు నేలమీఁద
చిఱునగవు మీఱ మొలిచిన గఱికిపోఁచ
యెండిపోలేదు నేఁడు శ్రీ యేసునాథ!
వచ్చి పోవయ్య! మాయింటివఱకు నీవు.

ఏదేశంబున నీ సుబోధనలు వాహిన్యాకృతిం దాల్చి, నా
నాదేశంబుల విస్తరించి, భవకాండజ్వాల చల్లార్చెనో!
ఆదేశంబె, త్వదీయ రక్తనదులం దాప్లావముం జేసె, విఁ
దేదో, వేదరహస్య మన్నయది తండ్రీ! క్రీస్తు! మృత్యుంజయా.

కలుకుం బల్లెపుఁబోటు నీ యెడమప్రక్కన్ దాకఁ గ్రొన్నెత్తురుల్
గురిసెన్ గుండెలనుండి నీవపు "డనుంగుం దండ్రి! నీ బిడ్డలన్
గరుణింపందగు నంచుఁ బల్కిన యనూనంబైన నీ యోర్మికిన్
ధరణీధ్రంబులు బద్దలై కరఁగలేదా? ప్రొద్దు చల్లాఱదా?

సొలోమోను గుడికుడ్యములఁ బ్రతిధ్వనియించు
భవదీయ బాల్యవిద్వజ్జయంబు
గాలిలీయ సముద్రకల్లోల పంక్తిని
గద్దించు నీ యధికారరేఖ
శవకదంబములకు జవసత్వముల నిచ్చి
బ్రతికించు నీ దివ్యవాఙ్మహత్త్వ
జలరాశిమీఁద స్వేచ్ఛావిహార మొనర్చి
యలరు నీ పావచిహ్నముల వరుస

చెప్పి చూపించి మా షలస్తీను భూమి,
పొంగిపోవుచునున్న దిప్పుడును గూడ
ప్రేమతత్త్వంబు రూపించి విశ్వములను
కౌఁగిలించిన నిన్ను నేఁ గౌఁగిలింతు.

# వీరపూజ

ఇలను భరింపనై పెనుఁగు నేనుఁగుపిల్లలవంటి పాండుపు
త్రులు గరిడీలలో గురునితోడఁ బరిశ్రమ సేయుచుండఁగా
మొలక మెఱుంగుజున్ను గవమోసల గగ్గురపాటుఁ బూని కౌ
గిలి యిడినట్టి దిగ్విజయగేహిని! ఢిల్లికి నీకు సేమమా

తనుసంగత్తుల యుక్కు పుప్పొడుల్ చిందన్ దాఁకు కౌరవ్యసే
నలతోఁ బోరు కిరీటిపుత్రుఁడు, ప్రచండంబైన తేజంబునన్
జలజవ్యూహముఁ జీల్చి చిక్కుపడి ప్రాణత్యాగముం జేయ గు
బ్బలువొంగం దలఁబ్రాలు వోసితివి రంభా! యెంత పుణ్యాత్మవో

ధరణిం గ్రుమ్మరు వింతభాస్కరుఁడు రాధాపుత్రు డానాఁడు సం
గరభూమిన్ బహువీరసైనిక శిరఃకాండంబుఁ జెండాడుచో
నరుణుండుం గనుసన్న సేయఁగ విషాదాప్తితో నీకు జె
చ్చెర నుప్పొంగిన చేఁపుబాలకుఁ, జెమర్చెన్ రాలు కుంతీసతీ!

కదలెదు పండుటాకువలెఁ గార్ముకమున్ ధరియించి, క్రీడికే
గ్గదలుపనీక యమ్ములు వెలారిచి వహ్నిశిఖాచయంబునాఁ
బొదలినవాఁడు మూఁడు జగము ల్దలక్రిందులు చేయఁ జాలుమా
ముదుసలి బ్రహ్మచారి పడిపోయిన భూములు పూజనీయముల్.

లీల ననేక మానవకళేబరముల్ నులివెచ్చ నెత్తుటన్
దేల నఖండచండకరతేజుఁడు పార్థుఁడు గాండివంబుతో
నాలములో నటించు సమయంబున నింద్రుని వేయిగన్నులన్
రాలిన మోదబాష్పములు రత్నములై నిలిచెం బయోధులన్.

నెఱికురులమీఁద బంగారునీలమణులు
వెలయు చందాన నెమిలి కన్నులు రహింప
వెన్నుఁడు రథంబు నడిపిన వీరభూమి
స్వచ్ఛమానస గంగమ్మ సంచరించు.

## ఆంధ్రభోజుఁడు

ఇపు డాకృష్ణధరాతలేశ్వరుఁడు లేఁ డేమాయెనో ! నాటి యు
ద్ధపు ఢంకానినదంబు మా తెలుఁగు విద్యాభారతీనాట్యమం
టప మయ్యష్టదిశామదేభముల క్రీడారంగ మెందున్నదో !
విపులాసుందరి దొంగిలించినది తద్వృత్తాంత మాణిక్యముల్.

పోటరి కృష్ణరాయనృపముఖ్యుఁడు ఖడ్గముఁ బట్టునాడు కుం
దేటికిఁ గూడఁ బౌరుషము నిండిన గాథలు సెప్పి మీసమున్
దీటిన, తెల్గువీరులకు, నేఁడు కనుంగవ చెమ్మగిల్ల, వ్యా
ఘ్రాటము గూడుకట్టె నవురా ! యతఁ డెక్కిన సింహపీఠికన్.

కాలము చక్రముంబలె, యెకాయెకి దొర్లుచుఁ బోవుఁగాని రా
జాలదు వెన్క కొక్క నిముసంబు గతిఁ గదిపిన దీని గర్భముం
జీలిచినన్ గనంబడు, నశేష మహీతలప్రవృత్తి, మిందులో
మూలుగుచున్న దాంధ్రుల విభూతి, శతాబ్ది పరంపరాహతిన్.

కడ చూడంబడరాని కాలమను రక్షఃకాంత గావించు గా
రడియం దబ్బు తెడాకులై నవి, విచిత్ర స్వప్నవృత్తంబులై
నడచుం బెద్దల జీవితంబు లివు, డీ నాట్యంబునం దెన్నఁడో
కడచెన్ రాయలవారి రాచఱికపుం గళ్యాణగాథాంకముల్.

వలపోయుం దలపోసి నేటికిని, పంపావీచులం దామరా
కుల నీడం గొలువైన చేఁప, లివు దుర్ఘోషించెడిన్ గోటగో
డలలో నీలపురుంగు, లాంధ్రుల ప్రతిష్ఠాజ్యోతి చల్లాఱెనే?
బలియై పోయెనె? కాలభూతములకుం బ్రాచీన రాట్సంపదల్?

ముదమున గండపెండియరవుం జిఱుగజ్జెల మ్రోఁతతోడ, నీ
సదనమునందుఁ గ్రుమ్మరు లసత్కవితాసతి తాతగారి య
భ్యుదయము విన్న, నాహృదయ మూరక పొంగులు వారినాఁడు నే
నుదయమునందనైతి ననియున్ దలతున్ నులివెచ్చయూర్పులన్.

పసిఁడిమూటలు పీవులపై నటింప
నాంధ్రకవి కుమారుల సాఁగనంపినావు
అపుడు పుట్టిన కవుల భాగ్యముఁ దలంచి
యేడుగఱతురు నిర్భాగ్యు లాధునికులు.

ఎనిమిదిమంది దిగ్గజము లీవల నావల నిల్చి, విశ్వమో
హనకవితామధూళిమ వియన్నదుల న్నిను ముంచి తేల్చినన్
దనియక, క్రొత్తక్రొత్త కవనంబునకుం దలయూఁచి, చేయి సా
చిన నినువంటిరాజు, కవిశేఖరుఁ డింకొకమాఱు పుట్టునే ?

సుందరములైన కబ్బము
లంది బహూకృతు లొసర్తు వఁట ; పాదము లం
దందియలు దొడిగి స్వయముగ;
నెందుంటివి ? కృష్ణరాయ పృథివీశమణీ !

మనుచరిత్రమునఁ బెద్దన పోఁతవోసిన
కృష్ణరాయని లసత్కీర్తి నగరు
ముక్కుతిమ్మన తెల్గు భూఖండమున నాటు
పారిజాత మహీజ పరిమళంబు
వరదరాజమ్మ కంబముపొంత నిలిపిన
మగనిపేరిట సుధామల సరస్సు
ఆంధ్రభోజుని కరం బభ్యుద్ధరింపఁగా
గులికి నవ్విన తొంటి తెలుఁగువాణి

కాలధూర్తాంగనావక్త్రి గహ్వరమున
సమసిపోవునె ? భువన ముచ్చలితమైన
వార్ధకంబును, మరణ, మెప్పటికి లేదు
ఆంధ్రరాజుల లీలావిహారములకు.

# మా ం సా హి

ఏదీ! నా కిఁక స్వేచ్ఛ? యీ భువనమధ్యేమార్గయానంబునం,
దీ దౌర్భాగ్యపు జిహ్వ కట్టువడిపోయెన్ శుష్కవేదాంతమున్,
బూదింబోలిన వర్ణభేదమును నేవో! రి త్తసిద్ధాంతముల్
నా దీక్షాభవనంబులో వెలుగు జ్ఞానజ్యోతిఁ జల్లార్చెడిన్.

ఒమరుఖయాము బోధ విని, యువ్విళులూరుచు వెన్నరొట్టెతో
సమరస మానినావు వెలసుందరి సిద్ధముసేయు మాంస ఖం
డములు పులావుతో మెసవినాడవు స్వర్గసుఖంబునందు భా
గము గలదందు వియ్యది దగాయగు మానుము పిచ్చియూహలన్

వాసించున్ జెలి నీకనుంగవను గైవల్యంబు నీ దృష్టికిన్
దాసత్వంబు వహింతువంచు మధురద్రాక్షారసం బాను, భో
గాసక్తుండు మహానుభావుఁడని వ్రాయంబూనినా, రీకవి
వ్యాసర్షుల్, పఠియింపఁజాల నిఁక మిథ్యాభారత గ్రంథముల్.

ఈ రహదారిలో నడువు, మీశ్వరదర్శన మబ్బునంచు, నా
ధారములేని పుక్కిటికథల్ వినిపించెడి మోసగాఁడ! ధి
క్కారముచేయు తెల్లదొరగారికి ముచ్చెలు మోపి మిత్రునిన్
జేరవ నున్నవాని నిరసించెద వెక్కడి వైపరీత్యమో!

అనృతపిపాసి! గే చెఱకునందుఁ దయారగునోయి! నీవు నే
ర్చిన పలుకుల్? దుబారుగ నశించిన రాజుల జీవితంబుతో
మనకుఁ బనేమి? తెల్లని సమాధినిఁ బోలిన నీ చరిత్రచే
మనుజులు మోసపోయిరి, ప్రమాదము లీ విషమప్రసంగముల్.

## రత్నచ్యుతి

ఒక రత్నంబును జేతఁబట్టుకొని, యూరూరం బ్రదర్శించి, చా
లక ఖండాంతరసీమ లెక్కి, నిజవాల్లభ్యంబు నూరించు సా
ర్థకతాదివ్యకుటుంబినీమణి మదాంధ్రక్ష్మాతలాతన్వి, యా
యొక రత్నంబును బాఱవేసికొనెనఁట్యో యెట్లు శాంతించునో!

రతనము జాఱిపోయినదిరా! సుకుమారకుమారులార! మీ
యతనము లింక సాధ్యపడ, వాంధ్రధరాతల మెల్ల జిక్కుటం
ధతమసవార్ధిలో మునిఁగెరా? మన గాంధికిఁ జెప్పినారొ లే
దొ! తెలుపుఁడంచు గేకలిడుచున్నది చూచితిరే ధరాసతిన్.

ముప్పదియేన్మిదేండ్లు నిను మోసిన యాంధ్రధరాసవిత్రికిన్
గొప్పున దిద్దిపోయితివి, కోమలకాంచనదామకంబు నీ
యొప్పును, సత్కళాప్రతిభయుంగల కొండొక యాంధ్రవీరుఁ డిం
కెప్పటికిన్ జనింపఁగలఁడే? జనియించినయేని దక్కునే?

నిమ్నఁ గామించిన కీర్తిగోపికలు, నీ నిర్యాణ వార్తాహతో
గ్ధనబాణంబున బొమ్మ గ్రుద్దుకొని, నీ గంభీరగాథావిమో
హన బృందావన వీధులం బరువులేయన్ జొచ్చె, నీ శోకవా
హిని నేరీతిఁ దరింతురో, తెలియదోయీ! రత్నగోపాలకా!

కృష్ణవేణీతరంగిత తరంగములందు
దేశీయగానంబు దిద్దినావు
జాతీయపౌరుష స్వచ్ఛంద రక్తంబు
చీరాలరణసీమఁ జిందినావు
పులిని గ్రుద్దుకు జంపఁ గల దేహదార్ఢ్యంబు
మును బందిఁ దో ధారవోసినావు
శతకోటి మన్మథ స్వర్ణ సౌందర్యంబు
పీడరోగమున కర్పించినావు

పలుకు పలుకున హాస్యసంపదలు గురియు
సహజవైదుష్యమునకు నిచ్చలును పొంగు
నాంధ్రసోదరలోక మల్లాడ నపుడ
స్వర్గమెక్కితి వేల? గోపాల, నీవు!

బహువిధంబుల గ్రుక్కఁబట్టి యేడువఁజొచ్చె
నగమైన నీదు దీక్షకుమారి
హా రెకస్థలమీద బడి మొత్తుకొన సాఁగె
దిక్కులేని భవత్ప్రతీలలామ

హృదయంబు బ్రద్దలై పొదల, దిక్కులు సూచె
మితిలేని నీ బంధుమిత్రకోటి
ప్రకృతి సుందర వైభవం బేది, కళదప్పె
క్షేమాంకమైన నీ రామనగరు

దాసు వోయిన యల కల్కతాపురంబు
పగిది గుంటూరుపురి శోకభరిత మయ్యె,
నయ్యయో ! ఆంధ్రరత్న ! నీ యాగమమున
స్వర్గపట్టణ మానందభరిత మయ్యె.

ధనవంతమైన లండనుపట్టణమునందుఁ
దెల్గునేలకు వన్నెఁ దెచ్చినావు
స్వాభిమానము జాటు వంగరాష్ట్రమునందు
గౌరవాభ్యుదయంబుఁ గాంచినావు
రాజమహేంద్రపురాన "యల్టీ" దాక
సిరిమీఱఁ బాఠంబుఁ జెప్పినావు
ఒక యుపన్యాసంబునకు నూఱుఁ బదునార్లు
గాఁ గట్నములు మూట గట్టినావు

పెదవి గదలించి, నీవు నవ్వింపనట్టి
భారతీయుఁడు, నొక తెల్లవాఁడు లేఁడు,
ఇంత చాతుర్యజలనిధి వింతలోన
రూపుమాసితివే, రత్నరూపకృష్ణ !

భౌతికశారీర పంజరంబేకదా ?
  చితిమీఁద దగ్ధంబుఁ జేసినావు
క్షణభంగురంబైన సౌందర్యమేకదా ?
  మృత్యుదేవతకు నర్పించినావు
కంటికిం గనరాని కంఠస్వరమెకదా ?
  కాలవాహినిలోనఁ గలిపినావు
చేటాడి జాలు నాయుర్దాయమేగదా ?
  వెఱ్ఱిబ్రహ్మ మొగాన వేసినావు

మరణధాటికి, జరకు, దత్తరముపడెను
తతయశఃకాయ మిప్పుడు దాల్చినావు
ఇపుడు జీవించియున్నాఁడ వింద్రసభకు
రత్నదీపంబు లేని కొఱంతఁ దీర్చి.

మహిత స్వరాజ్యోద్యమము పోరి కెమురెక్క
  మడమ ద్రిప్పని వీరమండనుండు
గాంధిభక్తుని జిహ్వఁ గదలించి, వెలలేని
  రత్నంబుఁ గొన్న సార్థకపురుషుండు
వాసికెక్కిన నేర్పు మూసలో గుండెలా
  ల్గరఁగింపఁజాలు నఖండవక్త
పరుల వంచించు టక్కరి భక్తులకు నగ్గి
  కొరడాలు సృష్టించు గుణవిభుండు

దినము గడచుట కింట బత్తెంబు లేక
నిత్యసంతర్పణంబులు నెఱపు భక్తుఁ
డాంధ్రవైభవధ్వజ మూడి యవనిఁ గూలఁ
గూలిపోయెనె ! మా రత్నగోపకుండు.

## శబ్దశాసనుఁడు

మాసిపోయిన శిలాశాసనంబులమీఁదఁ
దరువోజ వోలి ప్రత్యక్ష మగుచు
ద్రవిడభూపతుల బాంధవ్యంబు కతమున
ధ్వని సన్నగిలి నంగిదాన వగుచు
రాటాలకడఁ గూనదాగాలు పచరించు
బండుటవ్వలనోట బయలుపడుచు
ఇంటింటికడ బిచ్చమెత్తు జంగములగు
మ్మెటపాటలో మిట్టిమిట్టిపడుచు
పొలుపు దఱిఁగిన నిన్ను నభ్యుద్ధరింప
రాజరాజుల సభ, గప్పురంబుతోడ
నందుకొన్నాఁడు తాంబూల మాంధ్రవాణి
శబ్దశాసన కవిలోక చక్రవర్తి.
శబ్దసాధుత్వంబు సాధింప భ్రష్టవా
ఙ్మయమహాటవి నెంత నవసినాఁడొ !
ప్రబల దుర్భర కథాపదకంబు గుదిరింప
దలవాయ నెన్నాళ్ళు తలఁచినాఁడొ !

గౌతమీగంగ యంగము నంటి దీవించి
పసుప, నేరేపున మునింగినాఁడొ!
పసుపు రాచిన తాళపత్రంబు చేఁబూని
శ్రీకార మేనాఁడు చెక్కినాఁడొ!

తెలుఁగు నుడికారమున నమృతీకరించి
భారతామ్నాయమునకు జీవముల నూఁది
తేజముడిగిన క్షత్రియజాతీయ రక్త
నాళములు పుల్కరింప గానంబుజేసె.

వేఁగిరాజుల సతీపితతికి గరుపంపు
నడక నేర్పినది నన్నయ్య రచన
తెనుఁగుభాషాపద్మమునకుఁ జాబిని పన్నెఁ
బట్టించినది కవి బ్రహ్మపలుకు
కంచుఢక్కల నోరు గట్టించి జయకేత
నముల నెత్తినది శ్రీనాథు జిహ్వ
ప్రతిలేని యపవర్గ పదవిపంకకు రహ
దారి దీసినది పోతన చరిత్ర

విజయనగరాధిపుల భుజావేదికలకు
నందలంబులు మోయు మర్యాద గలపి
తవివిఁగొన్నది మొక్క పెద్దన కవిత్వ
మాంధ్రభారతీ! నీ తేజ మద్భుతంబు.

# అ యో మ య ము

"నా కవిత్వంబునందు రత్నములు గలవు
వానిఁ బెకలించి చూపెడువాఁడు లేఁడు
కాల మిట్లున్న" దని మొనగాఁడు వోలెఁ
బలుకు కవిగాఁడ ! యేటికీ స్వాతిశయము ?

ఏవీ ? యా రతనంబులు
నీవే పెకలించి చూపి, నీయింటికిఁ గొం
పోవోయి ! యట్లొనర్పఁగ
నీవలననె గాదొ ! యింక నీల్గెద వేలా ?

"ఇయ్యది నూత్నపుంగవిత, యీ కవనంబును జూచెనేని, న
న్నయ్యయుఁ గొయ్యవాఱిచనఁడా ?" యని వెఱ్ఱిమొగాలు, పప్పు రా
మయ్యలు, కొందరన్న విని, యాత్మను బొంగెదె ? వడ్లగింజలో
బియ్యపుగింజగా కిది, కవిత్వమటోయి ! బడాయిగొట్టఁగన్.

కమ్మని భావము గల ప
ద్య మ్మొక్కటి వ్రాయజాల; వన్నిటిలో, "ము
గ్ధమ్మా ! ప్రణయమ్మా !" యని
యుమ్మలికించెదవు నీదియుం గవనంబా ?

ధ్వనిచే ముద్దులుగాఱు భావములు చిందన్ముచ్చటల్ సెప్పుచున్
దెనుగుంగబ్బపు ముద్దులాడి, మును జన్మించెన్, గవిబ్రహ్మ దా
ల్చిన ఘంటంబున; నీయభావకవితాచిత్రాంగి, నీ తిక్కనా
ర్యునిముందేల ప్రవేశపెట్టెదు ? చిరాయుస్స్మారదూరీకృతన్.

వరిగడ్డింబలె, బేలవం బగు నభిప్రాయంబు గర్భంబులో
నిఱికింపంబడి, పెద్దమూఁగదయిపోయెన్ గర్భమీసొమ్ము లూ
సరవెల్లుల్, చరణంబు సాఁగని నికృష్టంబైన మార్గానఁ జీఁ
దఱఁ బుట్టించెద వేల? శ్రోతల కనర్థ వ్యర్థవాచాలతన్.

కవిసమయంబుఁ దప్పి, పడికాఁడవు సొంపును బాడుసేసి, నీ
వెటతుకకోసమో! కమిలి పేర్చుచుఁ జక్కని తెల్గుకైత కా
యువులు గుదించి, యేమిటి కయోమయమ్ముఁ బోసరింతు వీవు? నీ
కవనము పాడుగాను. వెడఁగా! యిఁకనేని యురమ్ము దారికిన్.

ఇమ్మాడ్కిఁ బ్రణయ మధుర ర
సమ్మం జవిసూపి, నిన్ను సాధించుచు, నీ
గమ్మత్తు సేయు, నెవ రా
యమ్మాయి? వచింపరాదఁటయ్యా! మాతో.

## కళాశాల

అంతశ్శత్రుల సంహరింపఁగల బ్రహ్మజ్ఞానపాథోధి, నీ
స్వాంతంబున్ దనియించు పండితుఁడు, కృష్ణస్వామి, నీస్వామియై
చెంతన్నిల్చి కుమార వర్గమును దాల్చెన్, బాహుమధ్యంబునన్
సంతోషింపుము దత్తమండల కళాశాలా! విశాలాశయా!

పరువుల్ వాఱెడు నీ కుమారుల సుధాభావ ప్రపంచంబులో
గరళంబున్ జిలికింపఁబోకుము, కళాకాంతార జీవన్మనీ
శ్వరు లీ బిడ్డలు, గారడీబ్రతుకు మెచ్చంబోవ, రావేశబం
ధురముల్ వీరి హృదంతరాళములు విద్యుద్వాహినీ మాతృకల్.

తాతలనాఁటి చీకటి మదద్విపమున్ బొలియించి, లోకమున్
బూతము సేయ నీ సుతులు పోపలె నిచ్చట శిక్షఁబొంది, కెం
జేతులు సాఁచి యంకమునఁ జేరిన వీరల కంచఁ జేయవే
నైతిక సాంఘిక ప్రకృత నాటకదోష విఖండనాస్త్రముల్.

## సఖి

తూరుపు తెల్లవాఱినది, తోయజబంధుఁడు నీదు చూపుటం
కూరము దొంగిలించు ననుకొందును, ముందుఁ బరిగ్రహించు నా
చారము నాది మేల్కొనుము, చల్లని గాడ్పులు నిద్రలేచి, సం
చారము చేయుచున్నవి, ప్రసన్నములై మనకోస మంగనా!

తెప్పలువాల్చు కాలమును రేల ఘటించెడు నిద్రవేళ, నీ
యొప్పున కప్పగించుట కయో! ప్రతిబంధక మయ్యెనంచు నే
నెప్పుడు గుందుచుందును సఖీ! గతియించిన తెప్పపాటులో
నిప్పటి నీ విలాస మొక యించుక లేఁతగదా! వయస్సునన్.

కాలముముందుఁ జిక్కనని కన్నులుమూసి వచించుచుండు మూ
ర్ఖాళి; యెవండు ప్రాసియిడు నయ్యది యేరికి భుక్తమౌనొ? వ్యా
లోలములైన దేహములలో సుఖముండదు ముందు, నర్థచం
ద్రాళిక! ప్రక్కలింతు హృదయంబున నీహృదయంబుఁ జేర్పవే!

రేపనుమాటలో మన శరీరము సంశయ మన్న యర్థమున్
గాఁపురమున్న, దీదినమునం గడచన్న దసంశయంబు, చా
నా! పరిపుష్టినందు ప్రణయంబును దూరము నేసికొన్నచో,
పాపమొ! పుణ్యమో! యెఱుఁగవచ్చునె? ఖేదము రాజ్యమేలెడిన్.

పాలకులై, ప్రపంచ విభవంబును జుట్టిన గొప్పవారి గో
రీ లవిగో! శ్మశానమునఁ బ్రేయసి! వారి ప్రశంస లెల్ల వి
ర్మూలము లయ్యె, బొంది విడిపోవకముందు సుఖించువారిదే
మేలుఁకొందుఁ, గాలము గమింతము రమ్మ, కవుంగిలింతలన్

'తాళము, తాళ, పంచొక విధంబున నూఅటపుచ్చఁ జూతు వె
న్నాళలు తాళమందువు? చునంబులు చేఁవయైనమీఁద నీ
కాలవిలంబనంబు నరకంబుగదా సఖి! కీలుగంటులోఁ
బూలు, సుగంధముం దొఱఁగిపోయిన, ముద్దునఁ దీపి నిల్చునే?

కేవల రత్నకాంతులను గేరెడు ఏ జిగిమోవి గిన్నెలో
నీవఱకే మరందరస మించుక యంచులు దాఁటుచుండె, న
య్యో! వనితా తదీయలవ మొల్కిన నేను సహింపఁజాల, నా
భావము దోసిలొగ్గెడిని బండిన నవ్వున నంపఁజేయవే.

హృదయము శాంతిలేని బ్రతు కెందుల కూఱటఁజెందుమంచుఁ బ
ల్కెడు రపవర్గవాదులు, తలోదరి! లాభము గానరాదు నీ
పెదవులనుండి చిందిపడు, పిన్నని నవ్వును దేనెమాటతో
మెదిపిన భుక్తిపాత్రము సమీపము సేయుము, కోడి గూసెడిన్.

కామిని! కౌతుకంబనెడు గ్రంథము, నేఁటికిఁ బూర్తియైన దే
మో! మన కెల్లిపైఁ బడఁగ నున్నది దీర్ఘవిచారమో! గృహా
రామము పూచియున్నది, కరంబున నున్న పసిండి వీణతో
బ్రేమరహస్యముల్ పలుకవే! కడకన్నుల మ్రొక్కు లిచ్చుచున్

# యుగంధరమంత్రి

అక్కట ! యుక్కుసంకెలలు హస్తములం దగిలించి ఢిల్లి భూ
భుక్కని సేన పట్టుకొనిపోయెఁ బ్రతాప నరేంద్రసింహమున్
నిక్కె నఖండగౌతమిని నిల్పిన దాయల యోడచాఁప, నీ
వెక్కడ డాఁగియుంటివి ? వహింపుము టక్కరి పిచ్చివేషమున్.

పౌరుషరాశి, రుద్రనరపాలుని చేతి శరంబు నాలుక
గ్గోరుచు నోరుగల్లుపురిలో బడియున్నది, జేని గుఱ్ఱముల్
ధారుణిఁ దన్నుచున్నవి బలంబులు భీతిపిశాచివాతఁ గం
గారగుచుండె, లెమ్మిఁక ! యుగంధర ! ముక్తి కుపక్రమింపుమా.

అదె ! గోదావరి దాఁచియుంచినది, రాజాశ్రూదకం బజ్జ నీ
మృదుపత్రాంకుర హేమపాత్రికల, లెమ్మీ ! యందు గర్తవ్యము
న్నది, యాలింపుమి యోరుగల్లుపురి చింతాక్రాంతమై మ్రూల్గుచు
న్నది, మంత్రీ ! యిఁక నీయశీకరచనానాట్యంబు సాగింపుమా !

లేనవ్వు ల్బలసెన్ విరోధులకు ఢిల్లీకోటలో, రుద్రభూ
జానిన్ దాయలు నవ్వులాడుకొని రాశాతాండవంబైన ప్ర
జ్ఞానైపుణ్యము మీఱఁగాఁ దెలుఁగుజెండా నుద్ధరింపంగదే
యానందద్యుతు లోరుగల్లుపురిమధ్యన్ గుప్ప వోయింపుమా

# జేబున్నిసా

జీవితేశ్వర ! మన సుధాజీవితంబు
అంతరించెనె ? యొక కౌఁగిలింతలోనఁ
నాథ ! మన వినూతన యౌవనముల కిపుడె
వయసు నిండెనె ? యొక చుంబనముతోడ.

ఈ సులతాను కూఁతు రొకతే సకలంబున మందభాగ్య, యి
య్యో ! సఖి ! గుండెలోఁ గలఁగుచున్నవి సీసపుఁగొండ, లింక నా
శ్వాసము గల్గనేర్చునె ? ప్రశాంతి వహించిన నీ సమాధితో
బాస యొనర్చి చెప్పెదను వద్దిఁక నాకు సుఖప్రసంగముల్.

తొలగె న్నా తలపోఁతలన్నియును, నీతో భస్మమై, గాలిలోఁ
గలసెన్ భావికుటుంబినీత్వము, మనఃకాంతా ! దురంత వ్యథా
జ్వాలనంబే, శరణంబు నాకు నిఁక నీ బందీనిశాంతంబునన్
బలిగావింతును ప్రాణపంచకము తప్తంబైన నీ మూర్తికిన్.

కవితాతూలికతో లిఖించి నిను శృంగారించి, పూజించి మా
నవలోకంబున కప్పగింతును, మనోనాథా ! వనక్షోణిలో
భవదీయం బగు మేను నాకొరకునై భస్మంబు గావించుకొం
టివి, నే నీ ఋణ మెట్లు తీర్చుకొని శాంతింతున్ ధరామండలిన్.

మొగలు రాజన్యుని పగడాల మేడలో
వసియింప దింక నీ ప్రణయలక్ష్మి
ఢిల్లీనవాబుల మల్లెతోఁటలవంక
బరికింప దింక నీ వలపుఁ జిలుక
ఔరంగజేబుని యపరంజి గిన్నెలో
భుజియింప దింక నీ ముద్దులాఁడి
పాదుషానగరిలోఁ బట్టుపాన్పులమీఁదఁ
బవళింప దింక నీ పాదదాసి

అక్బరాది పితామహు లధివసించు
ప్రాంతగోరీలకడ నిన్నుఁ బాడుకొనుచుఁ
దిరుగుచున్నది నీతరి తీపులాడి
యగ్నిలో నన్నుపాసించు త్యాగమూర్తి !

## నికుంజము

ఆఁకొనియున్న తేంట్ల మధురాన్నముఁ బోకిరిగాలిపిల్లవాఁ
డాకుల పెట్టినాఁడు. చిగురాకుల కోకలు గట్టుకొన్న పుం
స్కోకిలవాణి ! పుష్పితకుంజవిలాసిని ! తేనె లేని పూ
రేకుల శుష్కవీథుల, ద్విరేఫము గానము సేయఁ బోవునే

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాంతం కైఫీయతు | 1 | 0 | నేనూ మాకాంతం | 1 | 0 |
| మునిమాణిక్యం నాటికలు | 1 | 0 | మునిమాణిక్యం కథలు | 1 | 0 |
| ఉపాధ్యాయుడు | 1 | 0 | కాంతం కాపురం | 1 | 0 |
| శరద్రాత్రులు | 1 | 0 | దీక్షితులు | 1 | 0 |
| రుక్కుతల్లి | 1 | 0 | తగూ నెంబరు శ్రీ | 1 | 0 |
| యథార్థ దృశ్యాలు | 1 | 0 | వినోద వ్యాసములు | 1 | 0 |
| కాంతం | 1 | 0 | నా స్నేహితులు | 1 | 0 |
| హాస్యకథలు | 1 | 0 | దాంపత్య జీవితము | 1 | 0 |
| తల్లిప్రేమ | 1 | 0 | రేడియో నాటికలు | 1 | 0 |
| కథానికలు | 1 | 0 | రాధబాబు | 1 | 0 |
| తిరుమాళిగ | 1 | 0 | మేరీ కహానీ | 1 | 0 |

## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాలక్షేపం 1 వ భా॥ | 1 | 0 | మాయలమాలోకం | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | అవును | 1 | 0 |
| గుసగుస పెళ్ళి | 1 | 0 | నిజం | 1 | 0 |
| ఇప్పుడు | 1 | 0 | మాటవరస | 1 | 0 |
| అప్పుడు | 1 | 0 | తనలో | 1 | 0 |
| అన్నీ తగాదాలే | 1 | 0 | మేజువాణి | 1 | 0 |
| రెండురెళ్లు | 1 | 0 | మన తెలుగు | 1 | 0 |
| పెళ్లి ట్రెయినింగ్ | 1 | 0 | లోకోభిన్నరుచిః | 1 | 0 |

## శ్రీ జి. జాషువకవిగారి ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఖండకావ్యము 1 వ భా॥ | 1 | 0 | ఖండకావ్యము 3 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | డిటో 4 వ భా॥ | 1 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఖండకావ్యము 5 వ భా॥ | 1 | 0 | గబ్బిలము 1 వ భా॥ | 1 | 0 |
| నేతాజీ | 1 | 0 | డిటో 2 వ భా॥ | 1 | 0 |
| బాపూజీ | 1 | 0 | పిరదౌసి | 1 | 0 |
| కాందిశీకుడు | 1 | 0 | స్వయంవరము | 1 | 0 |
| స్వప్నకథ | 1 | 0 | తెరచాటు (కల్పితనాటకం) | 1 | 8 |
| ముంటాజమహల్ | 1 | 0 | వీరాబాయి (చరిత్రాత్మక నాటకం) | 1 | 8 |
| నాకథ (జీవితం) | 1 | 8 | | | |

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి

ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉమర్ ఖయాం | 1 | 0 | శబరి | 1 | 0 |
| పంచవటి | 1 | 0 | మృత్యుంజయం | 1 | 0 |
| బృందావనము | 1 | 0 | శృంగార చాటువులు | 1 | 0 |
| సుభాషితము | 1 | 0 | | | |

వేగుజుక్క గ్రంథమండలి, బరంపురంవారి

అపరాధ పరిశోధక నవలలు

| | | | | |
|---|---|---|---|---|
| వాడేవీడు | 1 వ భాగము | 1 | 8 | 0 |
| నేనే | 2 వ భాగము | 1 | 8 | 0 |
| కాలూరాయి | 3 వ భాగము | 1 | 8 | 0 |

(ఈ పై మూడు కలిసి జుమిలియా కథ యగును)

| | | | |
|---|---|---|---|
| వేంకట్రావు | 1 | 8 | 0 |
| కోటీశుతనయ | 1 | 8 | 0 |
| విద్యార్థి విపత్తు (కర్లపాలెం కృష్ణారావుగారు) | 1 | 0 | 0 |
| నేనంటే-తంటా....(228 పేజీలు) | 1 | 8 | 0 |

## ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలివారి నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| సీతారామరాయలు | 1 | 8 | శకుంతల | 1 | 0 |
| రాజసింహ | 2 | 0 | స్వర్ణానందము | 2 | 0 |
| మృణ్మయి | 1 | 8 | దృఢప్రతిజ్ఞ | 1 | 8 |
| సంపూర్ణ శ్రీకృష్ణ చరిత్ర | | | వసుమతీవసంతము | 2 | 0 |
| 1 వ భా॥ | 1 | 8 | అపరాధిని | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 | ప్రణయచాంచల్యం | 1 | 8 |
| అపరాజిత | 1 | 8 | రజని | 1 | 0 |
| మధుర | 1 | 8 | వంగవిజేత | 1 | 8 |
| మృణాళిని | 1 | 8 | నౌకాభంగం 1 వ భా॥ | 2 | 0 |
| విషవృక్షము | 1 | 8 | డిటో 2 వ భా॥ | 2 | 0 |
| కృష్ణకాంతుని మరణ | | | స్వర్ణహాసు | 2 | 0 |
| శాసనము (పరిశోధక | | | అల్లాహో అక్బరు | 1 | 8 |
| నవల) | 1 | 8 | జమీందారు-రామరాజు | 1 | 8 |
| కమలాకాంతుడు | 0 | 6 | క్షమార్పణ | 2 | 0 |

## కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహల్యాబాయి | 1 | 0 | సౌందర్యతిలక 1 వ భా॥ | 1 | 8 |
| రాజరత్నం | 1 | 0 | డిటో 2 వ భా॥ | 1 | 8 |
| కృష్ణవేణి | 0 | 12 | వినోదములు 1 వ భా॥ | 1 | 0 |
| హేమలత | 1 | 4 | డిటో 2 వ భా॥ | 1 | 0 |
| కర్పూరమంజరి 1 వ భా॥ | 1 | 8 | Tales of Rajasthan అను | | |
| డిటో 2 వ భా॥ | 1 | 8 | రాజస్థానకథావళి 1 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయం | 1 | 4 | డిటో 2 వ భా॥ | 1 | 8 |

| | | |
|---|---|---|
| మణిమంజరి | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి 1 భా॥ | 1 | 0 |
| డిటో 2 భా॥ | 1 | 0 |
| Lives of Great men | | |
| మహాపురుషుల జీవిత | | |
| చరిత్రలు 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| డిటో 3 వ భా॥ | 1 | 8 |
| రామకృష్ణ పరమహంస | | |
| Life and Teachings | 1 | 0 |
| ప్రహసనమంజరి | 1 | 0 |
| నవ్వులగని | 1 | 8 |
| నానక్ చరిత్ర | 0 | 12 |
| గురుగోవింద చరిత్ర | 0 | 12 |
| సిద్ధార్థ చరిత్ర (గౌతమ | | |
| బుద్ధుని జీవితం) | 1 | 0 |
| రఘువీరుల చరిత్ర | | |
| (రఘువంశం) | 0 | 10 |
| సుధాశరచ్చంద్రము 300 పే॥ | | |
| Lake of Palms | 2 | 0 |
| గణపతి హాస్యనవల 1 భా॥ | 1 | 0 |
| డిటో 3 భా॥ | 1 | 0 |
| నందచరిత్ర | 0 | 4 |
| కృపాంభోనిధి (భక్తచింతా | | |
| మణిలోవలెనే భక్తిరస | | |
| పద్యములు కలవు) | 0 | 4 |
| భారతకథామంజరి | 0 | 8 |

## శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారి పరిశోధక నవలలు

| | | | |
|---|---|---|---|
| భీషణ ప్రతిహింస | 1 | 8 | 0 |
| ఘోరప్రతిక్రియ | 1 | 8 | 0 |
| బలవంతరావు | 1 | 8 | 0 |

వలయువారు:—


### కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.